# యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు

యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు....చురుకైన ఆటగాళ్లు, విద్యార్థులు.. చాలామంది స్నేహితులు గల విలాసవంతులు....మంచి భవిష్యత్తును ఆశించే యశస్కాములు. ఒక్కమాటలో చెప్పాలంటే మీవంటి యువకులు....ఫిలిప్సే ఎందుకు? వాళ్ళే అంటారు మీతో. ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది. (ఇది అసలైన టెంపర్ ఉక్కుతో తయారైంది). ఎంత చెడతొక్కినా తట్టుకోడానికి వీలుగా ఉంటుంది. ఇంకా ఫిలిప్స్ అందంగా ఉంటుంది. దీని స్నిగ్ధత, గంభీరత సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. విశిష్ఠ కరమైన బైక్. మొత్తంమీద నేటి చురుకైన యువకులకు ప్రత్యేకంగా విధానింపబడినది.

మీరు

## ఫిలిప్స్‌ను

అభిలషిస్తారు




టి ఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు, మద్రాసు-53.
(ప్రొప్రైటర్స్ : ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లి॥ మద్రాసు.)

అన్నపూర్ణా వారి



# ఆత్మగౌరవం

నిర్మాత డి.మధుసూదనరావు

దర్శకుడు కె.విశ్వనాథ్

నవయుగ విడుదల

నిత్యనూతన సంస్థకు సరికొత్త దర్శకుడు

నిత్యనూతన నటునకు సరికొత్త జంట

సంగీతం
రాజేశ్వరరావు

ఫొటోగ్రఫీ

Statement about ownership and other particulars about newspaper

**ANDHRA SACHITRA VARAPATRIKA**

1. Place of Publication : Madras
2. Periodicity of its publication : Every Friday
3. Printer's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1.
4. Publisher's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: (As above)
5. Editor's Name: Sri S. Sambhu Prasad
   Nationality: Indian
   Address: 29, Chamier's Road, Madras-28.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

NAMES ADDRESSES

1. Mr. S. Sambhu Prasad 29, Chamier's Road, Madras-28.
2. Mrs. S. Kamakshamma Do
3. Mr. S. Nageswara Rao Do
4. Mr. S. Radhakrishna 6 & 7, Thambu Chetty Street, Madras-1.

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. RADHAKRISHNA,
1-3-66. Signature of Publisher.



# ఉత్తరాలు

### ముఖచిత్రం

11—2—66 సంచిక 'శోభన్‌బాబు' ముఖచిత్రంతో శోభాయమానంగా వెలువడింది. ముఖ్యంగా ఈ సంచికలో మరో శుభ సూచికం! అక్కినేని 'మద్రాస్, స్టూడియో ప్రవేశం' నిజంగా మీరన్నట్లు, యిక మద్రాసుకు మంచి రోజులే!

వై. కె. మూర్తి. (విజయవాడ)

### కథలు

"రాబోయే ప్రళయం" నన్నెంతో ఆకర్షించినది. ఇటువంటి ఉన్నత ఆదర్శ భావ సమ్మిళిత కథలు అరుదుగా ప్రచురింపబడుతున్నా యనడంలో అతిశయోక్తి లేదేమో ! కాని యీకథలో రత్తి పాత్ర మూలంగా ప్రేమ గ్రుడ్డిది అనడం కంటె గుంభ్రడముగా ఉంటుంది అంటేనే మంచి దనిపిస్తుంది. దాన్కి తార్కాణము గోపన్న పై గల ప్రేమాభిమానాలు అతని అనంతరము రంగడిపై చూపిస్తున్న రత్తి పాత్రయే. మొత్తముమీద యీ కథ చాల బాగున్నదని చెప్పక తప్పదు.

యేలూరి చల్లారావు (హైదరాబాద్)

### న్యూఢిల్లీ లేఖ

ప్రధాని పదవికి శ్రీ సంజీవరెడ్డిగారి పేరు సూచన' అన్న విషయంపై శ్రీ కృష్ణ గారు వ్రాస్తూ 'రవాణా, సివిల్, విమాన రవాణా శాఖను ఆయన తీసుకోవటం, వెను వెంటనే శ్రీ భాభా విమానప్రమాదంలో మృతి చెందటం.....' అంటూ, పై రెండు అంశాలనూ సమన్వయపరచ ప్రయత్నిస్తూ, అర్థోక్తిగా ఆగిపోయారు. ఈ వ్యాఖ్య చాలా అసమంజసంగా ఉంది. ప్రముఖ వ్యక్తిగా శ్రీ భాభా మృతి ఎంతో విచారాన్ని కలిగించింది. అయితే శ్రీ సంజీవరెడ్డిగారు విమాన మంత్రిగా ప్రమాణం చేయటానికి, కొద్ది కాలం గడవకముందే విమాన ప్రమాదంలో శ్రీ భాభా మరణించటానికీ, ఏమైనా సంబంధము, సామరస్యం ఉన్నాయా ? అయితే... శ్రీ సంజీవరెడ్డిగారు, ఈ శాఖామాత్యులుగా ప్రమాణస్వీకారం చేయకుండా ఉంటే శ్రీ భాభా జీవించిఉండేవారని, శ్రీ కృష్ణగారి భావమా ?

ఏమైనా ఈ వ్యాఖ్య చాల, హాస్యాస్పదముగా ఉంది.

కుమారి కె. వి. కృష్ణకుమారి (కాకినాడ)

### వనితాలోకం

"మగవారు వంట చేయాలా?" వ్యాసం నన్నెంతో ఎక్కువ ఆకర్షించింది. ఈ కాలంలో మోడరన్ చదువులు ఎక్కువ అవడంవలన "వంట చేయటం అనాగరికం" అనే అభిప్రాయం చాలామంది అమ్మాయిల మనస్సుల్లో కలుగుతున్నాయి. అలాంటి అమ్మాయిల కందరికీ శ్రీమతి నిర్మలగారి రచన నోటికి చురక పెట్టినట్లవుతుంది. అమ్మాయిలకు వంట తెలీదంటే సిగ్గుచేటు కదూ మరి. ఇలా స్త్రీలకోసం ప్రత్యేక వ్యాసాలు వ్రాసి పంపే రచనలను మీరు తప్పక ప్రచురిస్తారని ఆశ.

ఆర్. ప్రేమకుమారి (మద్రాసు)

### వైజ్ఞానిక గాథాళత

14—1—66 వ తారీఖు పత్రికలో అధ్యాత్మ రామంగారు 'డాక్టర్' గారి "కవి సమయాలు" ను గురించి వ్రాసిందాని మీద చేసిన విమర్శ చూస్తుంటే ఏదో అంటే భుజాలు తడుము కొన్నట్లుంది. వైజ్ఞానిక విషయాలను వ్రాసేటప్పుడు మూఢ నమ్మకాలను ఎత్తి చూపించకూడదని ఎక్కడాలేదు. సాహిత్యపరంగా 'కవి సమయాలు' ఎంత మనోజ్ఞమైనా, వైజ్ఞానికంగా అవి మూఢ నమ్మకాలే. ఆ విషయాన్నే వారు వ్రాశారు. 'మనవారికి సోదా చేసే గుణం తక్కువ' అని వ్రాశారుకాని 'మన వారికి సోదా చేసే గుణంలేదు' అని వ్రాయలేదు వారు. విషయాన్ని పూర్తిగా అర్థం చేసుకోకుండా ఆవేశపడటం విజ్ఞుల లక్షణంకాదు.

శ్యామ్ సుందర్ (బొంబాయి)●

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 4-3-'66

విశ్వావసునామ సం॥ ఫాల్గుణ మాస శు॥ ద్వాదశి

సంపుటము : 58 సంచిక : 27

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14-1-1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా<br>రూ. పై. |
| --- | --- |
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
| --- | --- |
| సంవత్సర చందా | 24.50 |
| అర్ధ సంవత్సర చందా | 12.25 |


## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

సం॥

## మన లో మా ట

ఈ సంచికలోనే 'రచయితలకి మనవి' ఒకటి ప్రచురించాము. ఆంధ్ర సచిత్ర వారపత్రికకి తమ రచనలు పంపేవారందరూ దానిని చదివి, అందులో పేర్కొన్న నిబంధనని పాటించ గోరుతున్నాము.

మా కార్యాలయం చేరే కొన్ని వ్రాతప్రతులతోబాటు, 'స్టాంపులు జత పరుస్తున్నా'మని రచయితలూ, రచయిత్రులూ రాస్తూ ఉంటారు కాని నిజానికి స్టాంపులు కనిపించవు ! ఇది రచయిత(త్రు)ల పొరపాటువల్ల కావచ్చును, లేదా (ఎక్కువ కవర్లు బుక్ పోస్టులో వస్తాయి కాబట్టి, కొన్ని సమయాలలో మాకు చేరే సరికే చిరిగిపోయి ఉంటాయి కాబట్టి) స్టాంపుల దొంగతనంవల్ల నయినా కావచ్చు !

అంతేకాక, కొందరు రచయితలు తపాలా బిళ్లలని వ్రాతప్రతులలో లోపల ఎక్కడో అతికిస్తారు. వ్రాతప్రతులు మా కార్యాలయం చేరగానే వాటిని 'రిజిస్టర్'చేసే వ్యక్తికి ఇవి తేలికగా కనిపించవు; చదివేవారికి మాత్రం తర్వాత కనిపిస్తాయి. ఇది కొంత ఇబ్బంది కలిగించటమే కాక, వ్రాతప్రతుల కట్టల కదలికలతో కొన్ని స్టాంపులు జారిపడిపోయి అవి పోవటమో, దొరికినా ఏ వ్రాత ప్రతిలోనుంచి జారిపడిందో తెలియకపోవటమో చేత పొరపాట్లు జరగటానికి కూడా అవకాశం కలిగిస్తుంది. ఈ విధమయిన సంఘటనలు ఇంతదాకా బహు కొద్దిగానే జరిగినా మాకూ, రచయితలకీ కూడా చాలా ఇబ్బంది కలిగిస్తాయి.

అందుచేతనే 1—4—1966 తర్వాత మా కార్యాలయం చేరే వ్రాతప్రతులలో రచయితల చిరునామాతోబాటు తగుమాత్రం పోస్టేజి అతికించి ఉన్న కవర్లు జతపరిచినవే తిప్పి పంపబడుతాయి.

రచయితలూ, రచయిత్రులూ మా మనవిని గమనించి ఎప్పటివలె సహకరించగలరని ఆశిస్తున్నాము.

## వి ష యా ను క్ర మ ణి క

# ప్రస్తుతం భారతదేశం


ప్రజలు
పన్నులు
ధరలు



ప్రపంచ దేశాలన్నీ
ఇండియాకు
ఆహారాన్నం దించి
సహాయపడాలి



చూశారా మేము
బయటే ఉన్నాం
మనవ మాత్రం
జైల్లో పడ్డాడు!
దొంగ
వ్యాపారస్తులు





మనకు
తినడానికి
లేదు కానీ
వాటికి మాత్రం
పుష్కలంగా
ఉంది



దుబారా
అధికవ్యయం



మేము చాలా
హాయిగా
ఉన్నాం
కరవులు
నిరుద్యోగం
కొరత
పాలకవర్గం
ప్రజల పాలిట భూతాలు

# జైపూర్ కాంగ్రెస్ మహాసభలు: ఒక పరిశీలన

సాగర్ విశ్వ విద్యాలయంలో స్నాతకోత్తర వ్యాసం లోనూ పెట్టుబడి సంస్థలపై కఠినమైన అదుపు ఉండాలని సూచించిన వ్యక్తి శ్రీ మెహతా.

సభలో పాల్గొనాలని ఆర్థికమంత్రి శ్రీ శచీంద్ర చౌదురిని ఆహ్వానించనైనా ఆహ్వానించలేదు. భారతదేశంలో ఆర్థిక పరిస్థితికి సంబంధించిన తీర్మానాన్ని ప్రతిపాదించవలసిందిగా మహాసభ దేశీయాంగ మంత్రి శ్రీ గుల్జారీలాల్ నందాను కోరింది కాని శ్రీ అశోక మెహతానుకాదు. ఆర్థికాభివృద్ధిని సాధించే మార్గంలో ఎదురవుతున్న అవరోధాలను, ఆర్థిక అసమానతలను తొలగించటం ఎలాగో, భువనేశ్వర్ కాంగ్రెసు తీర్మానాన్ని క్రమేణా ఆచరణలో పెట్టడం ఎలాగో పరిశీలించడానికి ఒక సంఘాన్ని నియమించే అధికారాన్ని ఈ తీర్మానం కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజుకు ఇస్తున్నది.

ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీ నందా చతుర్థ ప్రణాళికను నిర్ణయం చేయటంలో తృతీయ ప్రణాళిక లక్ష్యాలను సాధించటంలో ఎదురవుతున్న చిక్కులను వివరించారు. ద్రవ్యాధారాల పరిస్థితి, స్వదేశీ ద్రవ్యం, విదేశీ ద్రవ్యం—రెండింటా బహు క్లిష్టంగా ఉన్నదని ఆయన చెప్పారు.

జాతీయాదాయాన్ని కనీసం 6½ శాతమైనా పెంచలేకపోయాయని, 6½ శాతమైనా పెంచలేకపోతే భువనేశ్వర్ తీర్మానంలో ఉద్దేశింపబడిన లక్ష్యాలను సాధించటం కష్టమని ఆయన అన్నారు.

ధరలు పెరగటంవల్ల, అభివృద్ధి పనులకు పెట్టే వ్యయం పెరిగిపోయింది. దాపుడు ధనం ఎక్కువైపోయింది. చట్టవ్యాపారం ద్వారా లాభాలుతీయటం ఎక్కువైపోయింది. ధరలు పెరిగినంతగా తమ రాబడి పెరగకపోవటంవల్ల పేదలు బాధలకు గురియైనారని శ్రీ నందా వివరించారు.

అభివృద్ధి ఇప్పటిలా మంద గమనంతో సాగుతూ ఉంటే సామ్యవాద లక్ష్యాన్ని సాధించే కృషిలో ఎంతమాత్రం ముందుకు పోలేమని శ్రీ నందా అంగీకరించారు. పదిహేను సంవత్సరాలలోపల ప్రజల ప్రాతిపదిక అవసరాలను బాగా తీర్చడానికి భువనేశ్వర్ తీర్మానం ఉద్దేశింపబడింది. ఈ తీర్మానం గురించి ప్రజలు ప్రభుత్వానికి పదేపదే గుర్తు చేస్తున్నారంటే ఇది సబబైన విషయం కాదనలేం.

జైపూర్ మహాసభలో భారత ప్రభుత్వ ఆహార విధానం ముఖ్యంగా కొత్త ఎరువుల విధానం, మద్రాసు ఎరువుల ఫ్యాక్టరీకి సంబంధించిన ఒప్పందం తీవ్రమైన విమర్శలకు గురైనాయి. చివ్వరకు శ్రీ కామరాజ ఉపాయం ఫలించింది. నిజానికి జైపూర్ కాంగ్రెసు సభలలో శ్రీ కామరాజు మరింత బలంగా నిలబడ్డారు. ప్రైవేటురంగ మద్రాసు ఎరువుల ప్రాజెక్టుకు ప్రభుత్వం విపరీతమైన ధరలను ఒప్పించినట్లు కనబడింది. శ్రీ కామరాజు అలా కనిపించేటట్లు చేశారు. పండిట్ కె. డి. మాళవియావంటి లలిత సామ్యవాదులు తమ చిత్తానుసారం ఈ ఎరువుల ఒప్పందాన్ని దుయ్యబట్టడానికి ఆయన వారికి పూర్తి స్వేచ్ఛనిచ్చారు. అయితే నికరమైన తీర్మానంలో ఎరువుల విధానం గురించికాని మద్రాసు ఎరువుల ప్రాజెక్టును గురించి కాని ఏటువంటి ప్రస్తావన లేదు. ఈ రెండూ ఎప్పటిలాగే ఉన్నాయి.

ఆర్థిక విధానానికి సంబంధించినతీర్మానం కొత్త విధానాన్ని సూచించలేదు. ఆ



# న్యూఢిల్లీ లేఖ

తీర్మానం సత్వరాభివృద్ధిని సాధించగల కొత్త విధానానికి వెతుకులాటగా కన్పించింది. తీర్మానంలో భువనేశ్వర్ తీర్మానానికి సంబంధించిన ప్రస్తావన ఉన్నది. శ్రీ కామరాజు ఏర్పాటు చేయనున్న సంఘం ఈ తీర్మానాన్ని ప్రస్తుత ఆర్థిక పరిస్థితి దృష్ట్యా పరిశీలించాలి. ఈ సంఘం ఇంకా ఏర్పాటు కాలేదు. ఈ సంఘంలో ఎవరెవరిని వేస్తారో, సంఘం పరిశీలించే అంశాలు ఏమిటో—వీటిపై ఈ సంఘం యొక్క కార్యం జయప్రదం కావటం, కాకపోవటం ఆధారపడి ఉంటుంది. ఈ సంఘం ఫలానా గడువులోగా నివేదికను సమర్పించాలంటూ జైపూర్ తీర్మానం ఒక గడువు పెట్టలేదు.

ఇది యిలా ఉండగా ప్రధాని ఇంచుమించు ఎప్పుడు వాషింగ్టన్ వెళ్తారో ప్రకటించటం జరిగింది. పార్లమెంటు గ్రాంటులకు సంబంధించిన పద్దులను గూర్చి చర్చ జరిపే సమయంలో ఆమె భారత్ నుండి వాషింగ్టన్‌కు బయల్దేరి వెళ్తారని అనుకుంటున్నారు.

**కీ. శే.** శ్రీ కెనెడీకి, శ్రీ జాన్సన్‌కు పూర్తిగా తేడా ఉన్నది. ఇప్పుడు శ్రీమతి గాంధీ ఈయనతో వ్యవహరించాలి.

**ఇటీవల** పత్రికాగోష్ఠి సల్పుతూ అమెరికా అధ్యక్షుడు భారత ప్రధానికి ఎప్పుడు వీలైతే అప్పుడు అమెరికాకు రావచ్చునని, అప్పుడు తాను ఆమెను కలుసుకుని చర్చలు జరుపుతానని ప్రకటించారు. ఉభయులు సమావేశమైనప్పుడు తాము భారత ప్రజలకు సహాయపడటానికి ఇంకా ఎటువంటి చర్యలు తీసుకోవాలో ఆలోచిస్తామని, ఉభయులకు సంబంధించిన సమస్యలను పరిశీలిస్తామని, భారతీయ ప్రజలు వారి మిత్రులైన అమెరికన్లకు ఏవిధంగా సహాయపడగలరో చర్చిస్తామని ఆయన చెప్పారు. ఇది చాలా ముఖ్యమైన ప్రకటన. సహాయం అనేది ఇంకమీదట సహాయ పడవలసిందిగా భారత్‌ను కోరడం జరుగుతుందని ఈ ప్రకటన తేటతెల్లం చేస్తున్నది. మొదట వియత్నాంలో శాంతిని స్థాపించటానికి అమెరికా భారత్ సహాయాన్ని కోరుతుందని ఇది వ్యక్తం చేస్తున్నది.

స్వదేశీ, విదేశీ పెట్టుబడుల విషయంలో ఉన్న అవరోధాలను గురించి అమెరికా తనతో సహకరించే ఇతర దేశాలతో నిష్కపటంగా, నిర్మాణాత్మకంగా పరిశీలన జరుపుతుందని శ్రీ జాన్సన్ విదేశీ సహాయాన్ని గురించి అమెరికా కాంగ్రెసుకు యిచ్చిన సందేశంలో ప్రకటించారు. ప్రయోజనకరంగా లేని కంట్రోళ్లను తొలగించటానికి అమెరికా తన సహాయాన్ని కొనసాగిస్తుందని, వర్ధమాన దేశాలలో ప్రయివేటు పెట్టుబడులను ప్రోత్సహించే కృషిని ఎక్కువ చేసిందని ఆయన స్పష్టం చేశారు.

శ్రీమతి గాంధీ వాషింగ్టన్‌కు వెళ్ళినప్పుడు ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు శ్రీ జార్జి ఉడ్‌ను కలుసుకునే అవకాశం ఆమెకు లభిస్తుంది. బెల్ బృందంవారు తమ నివేదికను తయారుచేసి యిచ్చారు. దీనిని యిప్పుడు భారత ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

స్వయం సమృద్ధిని గురించి, స్వయం పోషకత్వాన్ని గూర్చి భారత్ గొప్పగా కబుర్లు చెబుతూ వస్తున్నది. ఈ కబుర్లు కూడా ఇప్పుడు గట్టిగా వినబడటంలేదు. అవి మర్మర ధ్వనుల స్థాయికి చేరుకున్నాయి. అయితే యదార్థ పరిస్థితి ఏమిటంటే అమెరికా సహాయాన్ని నిలిపివేయటం భారత ఆర్థిక వ్యవస్థను అతి తీవ్రంగా కుదిపివేసింది. ప్రపంచ బ్యాంకు ఉదాసీన వైఖరిని చూపటంతో చతుర్థ ప్రణాళిక చిక్కులో పడింది.

ఈ అంశాలను దృష్టిలో పెట్టుకుని మనం జైపూర్ కాంగ్రెస్ సభలను మదింపు వేయాలి.

ఈ మహాసభలు ప్రధానికి ఎటువంటి

కట్టలేదు. సామ్యవాద స్థాపనే ఇప్పటికి కూడా కాంగ్రెసు లక్ష్యం. అయితే తక్షణం పరిశీలించవలసిన సమస్య ఉత్పత్తిని పెంచడం. దేశం అభివృద్ధిని సాధించటంలో, సామ్యవాద లక్ష్య సాధనలో అడ్డుపడుతున్న అంశాలేమిటో శ్రీ కామరాజుకు తెలుసు ప్రజాస్వామికమైన ప్రణాళికలవల్ల ధనం నానాటికీ కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరింపబడుతూ వస్తున్నది. మూడు పంచవర్ష ప్రణాళికల ద్వారా గడించుకున్న అనుభవం యీ విషయాన్ని తెలియ చేస్తున్నది. ప్రణాళికలు ఆర్థిక వ్యవస్థలో ప్రతిష్ఠంభనను కూడా తెచ్చిపెట్టాయి. శ్రీ కామరాజు నెలకొల్పే సంఘం పరిశీలించవలసిన సమస్యలు యివి. జైపూర్ సభలు ప్రతి రంగంలో ముఖ్యంగా వ్యవసాయరంగంలో ఉత్పత్తిని పెంచాలని వింతో గట్టిగా నొక్కి చెప్పాయి. సంఘం నియమింపబడి నివేదికను తయారుచేసి యిచ్చేలోగా ప్రభుత్వం ఉత్పత్తిని పెంచే చర్యల నన్నిటినీ తీసుకోవాలని కాంగ్రెసు సభలు ప్రభుత్వానికి ఆదేశం యిచ్చాయి.

ఈసారి శీతాకాలంలో దేశంలో సాధారణ ఎన్నికలు జరుగుతాయి. ఈ ఎన్నికలలో కాంగ్రెసును గెలిపించి తిరిగి కాంగ్రెసుకు దేశ పరిపాలనాధికారాన్ని అప్పగించాలంటే కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో శ్రీ కామరాజు సాధ్యమైన చర్యలు అన్నిటినీ తీసుకోవాలి. ఇందుకు ఆయనకు నిధులు, వోట్లు కావాలి. నిజానికి వోట్లకన్నా ముందు నోట్లు కావాలి. జైపూర్ కాంగ్రెస్ మహాసభలో ప్రసంగిస్తూ శ్రీ కామరాజు శ్రీమతి ఇందిరాగాంధి ఎన్నిక సాఫీగా, క్రమశిక్షణతో జరిగిందని, ఇందులో తనకు భారత్‌లో ప్రజాస్వామ్యం యొక్క బలం, జీవశక్తి దృగ్గోచరమైనాయని తెల్పారు. శ్రీమతి గాంధి భారతదేశానికి బలమైన ప్రభుత్వాన్ని యివ్వగలరని, ప్రజల ఆశలు, ఆశయాలకు అనుగుణమైన విధానాలను ఏర్పాటు చేయగలరని, ఆమె చేతులలో భారత్ సురక్షితంగా ఉంటుందని, ఆమెను నమ్మి భారత్‌ను ఆమె చేతిలో ఉంచవచ్చునని కూడా ఆయన అన్నారు.

—శ్రీ కృష్ణ ●

## రచయితలకి మనవి

1—4—1966 తర్వాత వ్రాత ప్రతులని తిప్పి పంపే విషయమై కొత్త పద్ధతిని అవలంబించవలసి వస్తున్నది. 1—4—1966 వరకూ మా కార్యాలయం చేరే వ్రాత ప్రతులతోబాటు తగు మాత్రం తపాలా బిళ్లలు జత పరచినట్లయితే తిప్పి పంపే ప్రయత్నాలు ఎప్పటిలాగే జరుగుతాయి.

1—4—1966 తర్వాత మా కార్యాలయానికి చేరే వ్రాత ప్రతులతోబాటు రచయిత (త్రు) లు తమ పేరు: చిరునామాతోబాటు తగు మాత్రం తపాలా బిళ్లలు అతికించిన కవరులు పంపాలి. ఆ తేదీ తర్వాత ఇటువంటి (సెల్ఫ్ ఎడ్రెస్‌డ్ ఎన్వలప్స్ విత్ పోస్టేజ్) కవరులతోబాటు వచ్చిన వ్రాత ప్రతులే తిప్పి పంపటం జరుగుతుంది.

**ఉత్త తపాలా బిళ్లలు జతపరచి పంపరాదు!**

రచయితలు ఈ నిబంధనని గమనించి ఎప్పటివలె మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

సంపాదకుడు,
ఆంధ్ర సచిత్ర వార పత్రిక.

# హాలీవుడ్ ప్రణయాలు-2

గావి బ్రియక్



భార్యాభర్తలుగా అవాగార్డ్నర్, ఫ్రాంక్‌సినాత్రా

మిల్టన్ బెర్లె ఎవరో? అమెరికాలో కెల్లా గొప్ప టెలివిషన్ హాస్య నటుడు. అతనంటే సుమారు 4 కోట్ల అమెరికన్ ఆడవారు పడి చస్తారు. కాని అతని వ్యక్తిగత జీవితం విచారకరంగా ఉంది. మైక్‌టాడ్ నిజంగా ప్రతిభ కలవాడు. తన భార్య ఎలిజబెత్ టేలర్‌కి వజ్రాలు అప్పు చేసి కొని ఎంత కష్టపడ్డాడో నాకు తెలుసు.

జేన్‌మాన్స్‌ఫీల్డ్ భర్త మైక్ హార్గిటే పెద్ద వస్తాదు. ఒక రాత్రి విందు జరుగుతూ ఉండగా జేన్ భర్తని "స్వీటీ (మిఠాయీ!) చొక్కా లాగూ విప్పి నీ కండలు చూపించు" అని అడిగింది. ఇది నేను స్వయంగా చూశాను.

జాకెన్ కెర్స్టారాక్, జింజర్ రాజర్స్ కెన్నిన్ అడి అడి చూట్లాడుకోవటానికే తీరిక మిగుల్చుకునేవారుకాదు.

కొలొరాడో రాష్ట్రం పెటుల్ టిల్లి హార్స్ టున్ (6 అడుగుల 6 అంగుళాల మనిషి) ఒక రాత్రి నా గడప దగ్గర చాప మీద తాగి పడి రాత్రంతా అక్కడే గడిపాడు. అతన్ని మళ్ళా చూడలేదు నేను. నా మొహం చూడటానికి _ సిగ్గుపడి ఉంటాడు.....

సినాత్రా! అతన్ని 1952 లో మొట్ట మొదట చూశాను. అవా గార్డ్నర్ అతన్ని [illegible] వదిలేసింది. స్పెయిన్‌లో [illegible]

తక్కిన చోట్లలాగే హాలీవుడ్‌లోనూ ప్రియురాలు వదిలిన మగవాడినిచూస్తే అందరికీ చులకన. ఫ్రాంక్ చాలా బాధ పడ్డాడు.

న్యూయార్క్‌లో 'కోపా కొబానా' లో ఒక కచేరీ చేశాడు. అది పెద్ద 'ఫ్లాప్' అయి ఊరుకుంది. అమెరికాలో గొప్ప తార లని అభిమానులు తేలిగ్గా క్షమిస్తారు. అవజయాన్ని సహించరు.

1952 లో నేను 'బీచ్ కోంబర్' అనే నైట్ క్లబ్‌కి వెళ్లాను. అక్కడ ఫ్రాంక్ సినాత్రా ఒంటరిగా బార్ దగ్గరకూర్చుని తాగుతున్నాడు. ఎవరూ అతని సంగతి పట్టించుకోవటంలేదు. నాతోపాటు ఇద్దరు విలేఖరులు కూర్చుని ఉన్నారు. ఫ్రాంక్‌ని నాకు పరిచయం చెయ్యమని అడిగినప్పుడు "ఇంకా ఎన్ని రోజులు సాగుతుంది ఇతనికి" అని అతన్ని మా బల్లవద్దకి ఆహ్వానించమని అనేశారు. "అంతేకాక, అతనితో తిరిగే వాళ్ళ దరికీ అతని దురదృష్టం పట్టుకుంటుంది." వారి అతిథిగా వెళ్ళిన నాకు వారితో వాదించటానికి ధైర్యం లేకపోయింది.

మరుసటి సంవత్సరం నాకు టెలివిషన్ కాంట్రాక్టు వచ్చిన తర్వాత హాలీవుడ్‌కి వెళ్లాను. ఒక పార్టీకి ఆహ్వానం వచ్చింది.

ఆ రాత్రి నా 'తోడు' హ్యాగ్ ఓబ్రియన్. ఆ రాత్రి హాలీవుడ్‌లో పేరుమోసిన వారందరూ అక్కడికి వచ్చారు. కాని నా కళ్ళు మాత్రం ఫ్రాంక్‌మీదనే నిలిచిపోయాయి. మే మిద్దరం ఒకరి కొకరు పరిచయం అయ్యాము. నాకు వెంటనే "ఫ్రెంచి బొమ్మా" అని పేరు పెట్టాడు. అప్పుడే పాట కచేరీ చేశాడు. చేసినంత సేపూ నా కళ్ళలోకే చూస్తూ ఉండి పోయాడు.

పార్టీ అయిపోయిన తర్వాత నన్ను ఇంట్లో దింపాడు. దింపినా నాతోబాటే లోపలికి వస్తాననలేదు. అనకపోవటం హాలీవుడ్ పద్ధతికి విరుద్ధం! చివరికి గట్టిగా ముద్దు పెట్టుకుంటావని కూడా ఇబ్బంది పెట్టలేదు......

ఒక వారం తర్వాత ఫ్రాంక్‌ని మరొక చోట కలిశాము. కలవకపోతే ఈ పాటికి ఒక నదిలో తలనిండా తుపాకీగుండ్ల తూట్లతో శాశ్వతంగా నిద్రపోతూ ఉండే దాన్నే!

అతన్ని ఆ రాత్రి ఒక నైట్ క్లబ్‌లో కలిశాము. ఆ క్లబ్ యజమాని ఒక పెద్ద గూండా. పేరు టూట్స్ షోర్. ఒకప్పుడు దొంగ సారాయి సరఫరా చేసేవాడు. అతని చుట్టూ ఎందరో హంతకులు తిరుగుతూ ఉండేవారు.

ఫ్రాంక్ స్నేహితులు చాలామంది పెద్ద గూండాలు. ఇవి అతని చిన్నప్పటి స్నేహాలు. అటువంటివారంటే అతనికి సరదా! ఆ రాత్రి మాతో బింగ్‌క్రాస్బీ కొడుకు ఒకతను కూడా ఉన్నాడు.

టూట్స్ షోర్ మా దగ్గరే వచ్చి కూర్చున్నాడు. ఫ్రాంక్‌ని వేళాకోళం చెయ్యటం మొదలు పెట్టాడు. "నీ గొంతుక పలక దేమిటి! ఎక్కడయినా మరిచిపోయి వచ్చావా?" అన్నాడు. అంతటితో ఊరుకోక క్రాస్బీ కొడుకుతో "మీ నాన్న పేరు ఉంది కాబట్టి సరిపోయిందికాని లేకపోతే వీధిలో అడుక్కుతినే వాడివే!" అని ఎత్తి పొడిచాడు. (అంతకి ముందే క్రాస్బీ కొడుకు తన సోదరులతో ఒక సంగీతం జట్టు ఏర్పరచాడు.)

నావైపు తిరిగి, "ఇదేనా ఫ్రెంచి బొమ్మ అసలు ఫ్రెంచి దేమిటి బ్రూక్లిన్‌లో పుట్టింది. నిన్ను మోసం చేసిందిలే" అన్నాడు.

నా చేతిలో వెండి షాంపెయిన్ గ్లాసొకటి —గ్లాసుకన్నా కుంచం అనవచ్చు— ఒకటేఉంది. షాంపెయిన్‌ని అతని మొహంలోకి విసిరాను. షాంపెయిన్ మంట పెడుతుంది. టూట్స్ గోల పెట్టేశాడు. ఎక్కడినుంచి

వెన్నారో ఏది రూపంలోఉన్న గొరిల్లాలు మనుష్యుల్ని చుట్టేశారు.

సినాత్రాకి ఒళ్లు మండిపోయింది. కుర్చీలుఎత్తి వాళ్లమీదికి విసిరాడు. గబ గబ నన్ను బయటికి లాక్కు వెళ్లిపోయాడు. బయటే నిలిపిఉన్న అతని కారులో ఎక్కి పారిపోయాము. బాగా దూరం చేరిన తర్వాత, "ఫ్రెంచి బొమ్మా, నాతో ఉన్నావు కాబట్టి నీ ప్రాణాలు దక్కాయి. టూట్స్ షోర్‌లాంటి వాళ్లతో చెలగాటాలు పనికి రావు" అని హెచ్చరించాడు. "సాధారణంగా అతనికి కోపం తెప్పించిన వాళ్లని సిమెంటులో పాతిగి నదిలో పడేస్తాడు" అన్నాడు.

ఫ్రాంక్ సినాత్రా నిజంగా తన ప్రాణాన్ని నా ప్రాణానికి అడ్డు వేశాడు.

అసలు ఫ్రాంక్ సినాత్రాతో ఎలా పరిచయం అయిందో పైన చెప్పాను. ఆ సంఘటన జరిగిన తర్వాత అంటే నన్ను ఇంటి దగ్గిర దిగపెట్టి వెళ్లిపోయిన తర్వాత—ఫ్రాంక్‌ని జోషెంక్ పార్టీలో అకలిశాను. జోషెంక్, అతని సోదరుడు నికోలస్ షెంక్ 'ట్వెంటియత్ సెంచురీ ఫాక్స్' స్థాపించారు. అతని వయస్సు 75, కాని చాలా చలాకీగా ఉండేవాడు.

ఆ రాత్రి పార్టీ అతని ఇంటి డాబామీద జరుగుతోంది. డాబామీదనుంచి చూస్తే పెద్ద ఈతకొలను ఒకటి కనిపించేది. పైన ఆకాశం చాలా నిర్మలంగా ఉంది. షాంపెయిన్ ధారాళంగా 'పారుతోంది'. ఎవరో "లాస్ వెగాస్‌కి వెళ్దామంటే ఎక్కుటికి వినోదాన్నేదయినా చూడొచ్చు" అన్నారు.

"బావుందికాని విమానం ఏదయినా దొరుకుతుందా?"

"నా విమానాన్ని నా భార్య తీసుకు వెళ్లిపోయిందే! శాన్‌డిగోలో ఏదో పార్టీకి వెళ్లింది."

"అయితే హావార్డ్‌కి కబురు చెయ్యండి" అన్నారు ఇంకొకరు ఎవరో. హావార్డ్ హ్యూగెస్ అంటే టి. డబ్ల్యు.ఏ. అధిపతి. ఎప్పుడూ పెద్ద జనానా ఉంచేవాడు.... ఇతనిపేరు వింటేనే నాకు భయం. ఏం చేసేవాడంటే, చక్కటి అమ్మాయి కని పిస్తే, మంచి కాంట్రాక్టు ఇచ్చి ఎక్కడో దాచేసేవాడు. (ఆర్. కె. వో. రేడియో కూడా అతనిదేగా) స్వేచ్ఛ ఉండేదికాదు, సినిమాలలో నటించటానికి అవకాశం ఉండేదికాదు. జీన్ రస్సెల్, లారెన్ బాకాల్ మొదలయినవాళ్లు ఇతని కారణంగా బాధలు పడినవారే! జీనా లోలా బ్రిజిడా అతన్ని ఎదిరించిందని చాలా హింస పెట్టాడు. ఆమెని నాశనం చెయ్యటానికి ప్రయత్నించాడు.

కాని ఫ్రాంక్ దగ్గిర హావార్డ్ పిల్లి అయిపోయేవాడు. ఒక టెలిఫోన్‌కాల్—పది నిముషాల తర్వాత లాస్ ఏంజలెస్ విమానాశ్రయం చేరాము. టి. డబ్ల్యు. విమానం ఒకటి మా కోసం కాచుకుని ఉంది. మా కర్మకొద్ది అది చాలా పాతది. ఒకటే ఇంజను ఉంది. రెండు గంటల ప్రయాణాన్ మా ప్రాణాలు తీసివేసింది. ఎప్పుడు కూలి పోతుందో అని భయపడిపోయాము.

జోతో అన్నాను దిగిన తర్వాత, "ఆ విమానంలోమాత్రం మళ్లీ ఎక్కను. ఇక్కడే ఉండిపోతా"

అందుకనే ఆ రాత్రి లాస్ వెగాస్‌శాండ్స్ హోటల్‌లో మకాము. మధ్యాహ్నం నన్ను ఫ్రాంక్ ఎలా మేలు కొల్పాడో పాఠకులకు చెప్పాను....... (సశేషం)



అయిటాజీ అనే ఈ అందమైన నటి కొలంబియా ప్రపంచంలో ... నటనకై అమెరికా వెళ్లేటప్పుడు లండన్ ఎయిర్ పోర్ట్‌లో తీసిన ఫోటో

# మద్రాసులో పాశ్చాత్య సంగీత కచేరీలు

పాశ్చాత్య, సంగీత, నృత్య, సంగీత, నాటక కళా రూపాలతో మొదటిసారిగా పరిచయం చేసుకోవడానికి కొందరికి, ఉన్న కొద్దిపాటి పరిచయాన్ని ఇనుమడింప చేసుకోవటానికి యింకొందరికి ఫిబ్రవరి మొదటి రెండు వారాలలో మద్రాసు వాస్తవ్యులకు అవకాశం కలిగింది. పూర్వ పరిచయం వున్నవారు ముగ్ధులయ్యారు. లేనివారు తమకు వచ్చే కొత్త కళా చైతన్యాన్ని చూసి మురిసిపోయారు.

వీటిలో మొదటిది నాటక అకాడమీ రమ్య రంగ భవనంలో ఏర్పాటు చేయబడ్డ 'ఇండియానా యూనివర్సిటీ జాజ్ అన్ సాంబ్ల్'! వీరి కచేరి గురించి తెలుసుకోబోయేముందు తెలుసుకోవలసిన పూర్వ కథ కొంత ఉన్నది.

ఇండియానా అన్నది అమెరికాలో ఒక రాష్ట్రము. ఈ ఇండియానా విశ్వ విద్యాలయం 1820 లో స్థాపించబడి యీనాడు ముప్పై ఆరువేల విద్యార్థులతో పదిహేడు వందల ఉపాధ్యాయులతో పదహారు కళాశాలలతో, పద్దెనిమిది వందల ఎకరాల పచ్చని బయళ్లలో మూడు పువ్వులు ఆరు కాయలుగా వెలుగొందుతున్నది. ఈనాటి విశ్వ విద్యాలయపు విద్యా ప్రణాళికలో ఒక ముఖ్య భాగమైన సంగీత కళాశాల 1921 లో ప్రారంభించబడ్డది. పదకొండువందల విద్యార్థులు తమ తమ నిర్ధారణతోబాటు సంగీత శాస్త్ర ధర్మాలలో పరిశోధనలు సాగిస్తున్నారు. ఇక్కడ గాత్ర సంగీతం, వాద్య (ఇన్‌స్ట్రుమెంటల్), వాద్య బృందం (ఆర్కెస్ట్రల్) సంగీతం అన్నీ నేర్పిస్తారు. విద్యార్థులకు యిక్కడవున్న అరుదైన అవకాశం అత్యంత ప్రోత్సాహజనకంగా ఉంటుంది. ప్రత్యేక ప్రతిభా విశేషాలు చూపిన ప్రతి విద్యార్థికీ పేరు పొందిన అనుభవజ్ఞులతోబాటు సంగీత కచేరీలలో పాల్గొనే అవకాశం యివ్వబడుతుంది. దీనివలన సంగీత శాస్త్రంతో, పుస్తకముఖ పరిచయమేగాక ప్రత్యక్ష సంబంధం, శ్రోతల ఎదురుగా వాయించడం, పాడటం కూడ అభ్యాసములో ఒక ముఖ్యాంశమే కలుగుతుంది. ఇటువంటి బహిరంగాభ్యాసాలలో ప్రతిభను చూపించి, పేరు ప్రఖ్యాతులతోబాటు బహుమతులను సంపాదించుకొన్న పలువురు ప్రముఖులను కూడగట్టి యీ 'జాజ్ అన్ సాంబ్ల్'ని నడుపుతున్నారు.

'జాజ్' అంటే యేమిటన్న మీమాంసపై ఆంగ్ల భాషలో ఒక వంద పుస్తకాలు వున్నవనుకొంటాను. కాబట్టి ఆమాటకు యిక్కడ విపులార్థాన్ని వివరించ ప్రయత్నించబోవటంలేదు. కాని మన భారతీయ శాస్త్రీయ సంగీతానికీ, జాజ్ కి ఒక ముఖ్యమైన పోలిక ఉన్నది. రెండిటిలో కూడా కొన్ని విధుల ననుసరించి మనో ధర్మానుసారం స్వర ప్రసారం చేస్తారు. ఆ విధులను మన సాంప్రదాయానుసారం రాగమంటారు. వారి పద్ధతిని 'స్కేల్' అంటారు. ఇది చాలా స్థూలంగా చెప్పిన విషయం. సూక్ష్మంగా ఆలోచిస్తే ఆ రెంటికి కేవలం అయిదారు వాక్యాలతో విడమర్చలేని యెంతో భేదాలు ఉంటవి.

ఈ బృందంలో పద్దెనిమిది వాద్యకారులు ఉన్నారు. జెర్రీ కోకర్ యీ అన్ సాంబ్ల్ (బృందానికి) నియామకుడు. వీరు వినిపించిన పదెనిమిది ఖండాలలో మొట్టమొదట ప్రేక్షకులను ఆకట్టుకొన్నది "టెంపస్ ఫ్యూజిట్" అన్నది. కాలం నిరంతరంగా భావిలోనుంచి భూతంలోనికి ప్రవహిస్తుంటుందనే భావానికి బడ్ పవల్ స్వర రూపంలో చేసిన వ్యాఖ్యానం. టెనార్ సాక్సోఫోన్ అనే వాద్యంపై గారీ కాంబెల్ అంత చక్కని విన్యాసాలు వినిపించారు. తరువాతి ఖండమైన 'ది వింటర్ ఆఫ్ మై డిస్కంటెంట్' లో కూడా అదే వాద్యాన్ని నియామకుడు జెర్రీ కోకర్ వాయించారు. వీరి వాదనలో మనో ధర్మ ప్రసారం ఎక్కువగా వినిపించింది. ఈ పద్ధతిని ప్రసారం చేయుటకు ఒకప్పుడు విఖ్యాత యేల్ యూనివర్సిటీలో వీరు నేర్పించేవారు. వాద్యగోష్ఠి అంతిమ ఖండాలలో ఒకటయిన 'ఫ్యూర్ డెవిల్ బ్యాగ్'' అన్న వ్హిట్ సిడెనర్ కృతి గారీ స్మార్ట్ వాయించిన పియానో మెళకువలతో ఉత్సాహపూరితంగా ఉరకలు వేసింది. దీనిరంజకు విలువ కట్టింది అయిదు నిమిషాలయినా ఆగని ప్రేక్షకుల కరతాళ ధ్వనులే.

విరామానికిముందు ఒక చిత్ర వాదన జరిగింది. కర్నాటక సాంప్రదాయంలో మృదంగం వాయించే యువ ఔత్సాహి టి. వి. గోపాలకృష్ణన్, అమెరికన్ బృందం లోని డ్రమ్మర్ స్టాన్ గేజ్ ఒక విధమైన యుగళ శబ్ద మాలిక నల్లి శ్రోతలను మంత్రముగ్ధులను చేశారు. సాధారణమైన 'జగల్ బంది' లో ఇద్దరు ఒకే మూసలోనున్న స్వరాలను పాడటమో, వాయించటమో చేస్తారు పెళ్ళి కూతురు చిత్రంలో 'అంతా ప్రేమమయం' చివరి భాగం వున్న మాదిరి' వీరిద్దరు అలా కాకుండా ఈషన్మాత్రం పోలికవున్న శబ్ద తరంగాలను సృష్టించేరు. పూర్తిగా పాశ్చాత్య పద్ధతిలో ఒకరూ, కర్నాటక బాణిలో మరొకరు, ఒకరి కొకరు తీసిపోడు వాదోపంగా చూపిన నైపుణ్య లాఘవం శ్లాఘనీయం.

—వి. ఎ. కె. రంగారావు



ఇండియానా యూనివర్సిటీ జాజ్ అన్ సాంబ్ల్ వారు సంగీతసాధన చేస్తున్న దృశ్యం.

# నాన్నగారి విచారం తొలగింది!
















## బాధ అనేది మాకు ఒక సమస్య...చూడండి మేము మీకు ఏవిధంగా సహాయపడతామో!

పరిశోధన: 'ఆస్ప్రో' యొక్క పరిశోధనా సంస్థలోని ఒక పరిశోధనా దళానికి నేను ఉపదేశకుడను. బాధను అపుజేయడానికి మంచి మంచి పద్ధతులను కనిపెట్టుటే మా పని. ఈ విషయమును గురించి ఏకాగ్రతతో ప్రపంచమంతటా పరిశోధనలు జరుపుతున్న అగ్రగణ్యమైన పరిశోధనా సంస్థలలో మేము ఒకరము. నొప్పిని నివారించుటకు నేడు క్రొత్త మార్గము 'ఆస్ప్రో' ఫార్ములా అని మేము తెలుసుకొన్నాము. అందుచేతనే ప్రపంచమంతటా డాక్టర్లచేతను, ఆసుపత్రులలోను ఇది వాడబడుతోంది.

బాధ అంటే ఏమిటి? మెటాబొలిక్ ఉత్పత్తులు, దేహము వాటిని తీసుకొని పోగలిగే కంటే హెచ్చు వేగములో, స్నాయువులలో కూడుకొని చేరి పోవడం వల్ల మరుగుపడిన వాపు కలుగుతుంది. దానితో నరములకు ఒత్తిడి కలిగి బాధ కలుగుతుంది.

'ఆస్ప్రో' ఎలా పనిచేస్తుంది: 'ఆస్ప్రో' దేహములో వెంటనే యిమిడి, వాపును, నరముల మీద ఒత్తిడిని తగ్గించి నొప్పిని వెడలగొడుతుంది.

'ఆస్ప్రో'ను ఈ వ్యాధులకు వాడండి: నొప్పి • తలనొప్పి • ఒంటినొప్పి • పంటినొప్పి • కీళ్ల నొప్పి • జ్వరముతో కూడిన జలుబు • ఫ్లూ • కీళ్ల నొప్పులతో గూడిన జ్వరము.

మోతాదు: పెద్దవారికి: రెండు బిళ్లలు, అవసరమైతే తిరిగి వేసుకొనండి. పిల్లలకు: ఒక బిళ్ల లేక మీ డాక్టరు సలహా ప్రకారము వాడండి.




**ఆస్ప్రో**
**నొప్పిని వెడలగొడుతుంది!**

A.Q. 19.65 TEL

# వారఫలం

**4-3-1966 శుక్రవారం మొదలు 10-3-1966 గురువారం వరకు.**

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీ అంచనాలను మించి వ్యయం జరిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో మీ మంచితనాన్ని తమ స్వార్థానికి వినియోగించుకొన చూడానికి ప్రయత్నించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. ఉద్యోగంలో సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. పొరుగు వారితో వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు.

**వృషభం:** గ్రహబలం అనుకూలంగాఉంది.ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల కేవలం తాత్కాలికమైన లాభమే కాకుండా ముున్ముందు కూడా తగిన ఉపయోగం ఉంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు యిదివరకటి కంటే బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. శుభకార్యాల విషయంలో స్వల్పాటంకాలు వస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో స్వల్పభేదాభిప్రాయాలు రావచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

**మిధునం :** ఈ వారం చిత్రంగా ఉంటుంది. ప్రయత్నించిన పనులకు ఆటంకాలు రావడం, అనుకోని వ్యవహారాలు నెరవేరడం వంటి సంఘటనలు జరుగుతాయి. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడడం వలన మీరు పొందవలసినంత లాభాన్ని పొందలేకపోవచ్చును. నూతన వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో మీరు యిదివరకు చేసిన నిర్ణయాలవల్ల యిబ్బంది కలగగల సూచనలు ఉన్నాయి. సాంఘిక కార్యక్రమాల్లో ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు. కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యంప్రస్తుతం బాగాఉన్నా, నిర్లక్ష్యంచేయుతగదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** ప్రతివ్యవహారంలోను మీకుయేదో ఒకసందేహం కలుగుతుండడంవలనసాహసించి పనిచేయలేరు. కాని తరువాత మీ సందేహాలు సరియైనవేనని రుజువు కాగలవు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్తగల సూచనలు ఉన్నాయి. ఆదాయం మాట యెలాగ ఉన్నా, సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. ఉద్యోగంలో మీపరిస్థితి సామాన్యంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు—కుటుంబ సంతోషకరమైన వార్తలని వింటారు.

**సింహం :** వారం ప్రారంభంలోనే కొన్నివ్యవహారాల్లో మీ అదుపు తప్పి ఊహించని పరిణామాలకు గురికాగల సూచనలు ఉన్నాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో యితరుల జోక్యంవలన నష్టం వస్తుంది. వ్యాపారంలో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయిగాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకి లొంగిపోవడం తగదు. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. దూరప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలకు అనువైన సంఘటనలు జరుగుతాయి. విలాస వస్తువులు కొంటారు.

**కన్య :** ఏ వ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి వీలులేని సమయం. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడడంవలన తరచుగా మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఆరోగ్యం ప్రస్తుతం సామాన్యంగా ఉన్నా, శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు. న్యాయవాదులకు కళాకారులకు మంచి సమయం.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**తుల :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు యేవో ఆటంకాలు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని మీరు సమయస్ఫూర్తితో వ్యవహరించడం వలన వాటిని అధిగమించి తగిన అభివృద్ధిని సాధించగలరు. భారీ యెత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగాఉంటాయి. ఉద్యోగంలో అధికారులు మీ అభిప్రాయాలను ఆమోదిస్తారు. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు. పొరుగువారిలో గౌరవం లభిస్తుంది.

**వృశ్చికం :** ఈ వారం సామాన్యంగాఉంటుంది. ఆదాయం మామూలుగానే ఉన్నా, అన్నివ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు మాత్రం బాగా ఉంటాయి. మీ ఆలోచనలు మీ స్వంతవ్యవహారాల్లో కంటే యితరులకు సలహా రూపంలో బాగా పని చేయగలవు. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి.ఉద్యోగంలో మీకు ముున్ముందు ఉపయోగించగల వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా వే ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**ధనుస్సు:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడతాయి గాని తరువాత అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. కొన్ని వ్యవహారాల్లో మీకు నష్టం కలిగించడానికి యితరులు చేసే ప్రయత్నాలే మీకు లాభదాయకంగా మారగలవు. ఉద్యోగంలో మీరు చేయవలసిన ముఖ్యమైన నిర్ణయాలు వారం మధ్యలో చేయడం మంచిది. శుభకార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మకరం :** పూర్తిగా నెరవేరేవరకు ఏ వ్యవహారాన్ని నమ్మడానికి అవకాశంలేదు. మీ స్వంత పనులు బాగానే ఉన్నా, కొంతమంది మిత్రులకు చికాకులు కలగడంవలన మీరు కూడా యిబ్బందిని పొందవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో వారం మధ్యలో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో అనుకోని మార్పులు వస్తాయి. ప్రయాణాల్లో ప్రయోజనం కంటే ప్రయాస అధికంగా ఉంటుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం :** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి, జరిగేది మరొకటి కావచ్చును. వ్యాపారంలో మీరు యిదివరకు జరిపిన వ్యవహారాల్లో చికాకులు యేర్పడడం వలన ప్రస్తుతపు వ్యవహారాల్లో తగినంత శ్రద్ధ చూపించలేకపోవచ్చును. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ఉద్యోగంలో ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. కోర్టు వ్యవహారాల్లో వ్యయ ప్రయాసలకు గురికాగల సూచనలు ఉన్నాయి. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకూలంగా వ్యయం జరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం :** అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని మీరు యేమాత్రం యేమరుపాటుగా ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో అవస్థ మీద అనుభవం మరొకరిది కాగల పరిస్థితి యేర్పడుతుంది. కొన్ని వ్యవహారాల్లో అకారణంగా పొరుగువారితో మాట పట్టింపులు రాగల సూచనలు ఉన్నాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో చికాకులు కలగవచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు యిదివరకటి కంటే బాగా ఉంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

—మహేష్ ●

HIMALAYAN
FINEST GOLDEN DUST TEA

# LIPTON'S

FINEST
GOLDEN DUST TEA

## మేలిరకం "డస్ట్" టీలలో సాటిలేనిది

# లిప్టన్స్
## హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ



ఈ టీతో మీరు కమ్మని, చిక్కని బంగారు ఛాయగల టీ కప్పులు ఎందరికైనా అతి త్వరలో తయారుచేయగలుగుదురు. ఈ పానీయమును మీరే త్రాగి చూడండి. మీ అతిథులకుకూడా యివ్వండి. మీరు తప్పక సంతోషముతో వికసిస్తారు. అవును – మీ ఆనందభరితులైన అతిథులుకూడాను. లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ మేలిరకం టీలలో నిజంగా అద్వితీయమైనది.




లిప్టన్స్
అంటే
మంచి టీ

సీరియల్

# కరుణ







కొండముది శ్రీరామచంద్రమూర్తి

జరిగిన కథ

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోపాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథను జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. కరుణను మన్మథకు చేసుకోవాలని జమదగ్ని కోరినా కరుణ ప్రసన్నను ప్రేమించుకున్నందువల్ల ప్రసన్నకే ఇచ్చి చేయడానికి మన్మథ ఇష్టపడతాడు. మన్మథ కూడా పై చదువులు చదవటానికి ఇష్టపడుతుంటాడు. చలపతి మన్మథను చదివించాలని పట్టుపట్టటంతో ప్రసన్న చదువు మానేయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. కరుణ, మన్మథ, విశాఖపట్నంలు ఎం. ఏ. లో చేరటానికి వాల్తేరు వెళ్తారు. సీటు సంపాదించటానికి మన్మథచేసిన ప్రయత్నాలు వ్యర్థం అవుతాయి. చివరికి ప్రొఫెసర్ సిఫారసు ద్వారా సీటు సంపాదించగలుగుతాడు మన్మథ.

## 19

కరుణ కంటికి దూరమైన తర్వాత ప్రసన్నకు కంటికి కునుకు రావడంలేదు. తను కూడా పట్టుబట్టి యూనివర్సిటీలో చేరితేనే మంచిదా ? అన్న ఆలోచనకు అతను అనుక్షణం లోనయ్యాడు. విరబూసిన గులాబులు కరుణ చెంపలను జ్ఞాపకను తెచ్చేవి. ముసిరిన మొయిళ్ళు కరుణ కన్నుల్లో దాగిన జాలిని స్ఫురణకు తెచ్చేవి. అతని కాళ్ళు అతనికి తెలియకనే, కరుణ ఇంటికి నడిపించేవి. చదువుతున్న పుస్తకంలో చక్కని రూప చిత్రం అక్షరాల మాటున కనబడితే, స్వప్నాల్లో కరుణ సాక్షాత్కరించేది. తనను హృదయానికి హత్తుకున్న ఆ బాహువులు, తన పాపిటను సరిదిద్దిన ఆ అంగుళులు, తనను చూసి నవ్వును తన వెన్నెల దాచుకున్న ఆ పెదవులు, పెదవుల వెనక తళుక్కుమనే ఆ పంటి వరుస, అతనికి పరధ్యానం నేర్పాయి. మజ్జిగ అన్నం తింటూ నెయ్యి వెయ్యమనేవాడు. కూర ముద్ద కలుపుకుని అందులో మజ్జిగ పొయ్యమనేవాడు. తల్లి బజారునుండి కూరలు తెమ్మంటే, వస్తు దినుసులు పట్టుకొచ్చేవాడు. అతని పరధ్యానం చూసి జమదగ్ని కలవర పడ్డాడు. అతని మతిమరుపు చూసి చలపతి చికాకు పడ్డాడు. కళ్యాణి ఎగతాళి చేసింది. శారదాంబ కంగారుపడ్డది.

"ఒంట్లో బావులేనట్టుంది. ఏదన్నా డాక్టరుకు చూపించుకోరాదూ ?" అన్నది శారదాంబ వోస్తూటు, అన్నం ముందు నుంచి లేచిపోతున్న కొడుకుతో.

"పోనీ, పొలానికన్నా పోయి వస్తుండ రాదూ ? అదో కాలక్షేపం" అన్నాడు జమదగ్ని.

"ఆఁ! ఆఁ! పాంటు నలక్కుండా, చొక్కా నలక్కుండా గట్టున నిలబడి పిళ్ళి వ్యవసాయం చేయిస్తే గాని, పంట సరిగా పండదు." అన్నాడు చలపతి ఎగతాళిగా.

ప్రసన్నకు ఆలోచించుకోగా ఆలోచించుకోగా, తన కేదైనా వ్యాపకం ఉండాలనిపించింది. ఉద్యోగం చేయడంకన్నా మంచి కాలక్షేపం మరొకటి లేదనిపించింది. దాంతో, మర్నాటి ఉదయం. తండ్రి స్నానం చేసి, రామకోటి రాసుకుంటుండగా దగ్గరకు చేరి, గోముగా అడిగాడు.

"నేను ఉద్యోగం చెయ్యదల్చుకున్నాను. మీకేమైనా అభ్యంతరమా ?"

జమదగ్ని తలయెత్తి కొడుకువేపు చూశాడు. ప్రసన్న వదనంలో అనేకానేక భావాలు ద్యోతకమయ్యాయి. రామకోటి కాయితానికి నమస్కారం పెట్టి అవతల పెడుతూ అన్నాడు.

"చదువుకోవలసిన కొడుకు చదువుకో లేక ఇంట్లో కూచుంటే, పెళ్ళయిన తర్వాత కూడా తగుదునమ్మా అని కోడలుపిల్ల చదువుకోటానికి పైనూరు వెడ్తే అభ్యంతరం చెప్పలేకపోయిన అసమర్థుణ్ని! ఇంకా నామీదెందుకురా నీకీ గురుత్వం ? .... అయినా నీ ఉద్యోగం ప్రయత్నాన్ని నే నెందుకు కాదంటాను ? నీకు ఏది మంచిదని తోస్తే అది నిరభ్యంతరంగా చెయ్ ! నా ఆశీర్వాదం నీకు ఎప్పుడూ ఉంది!"

ప్రసన్న తండ్రికి నమస్కారం చేసి, సరాసరి కాలేజీ ప్రిన్సిపాలు సుబ్బిరెడ్డి దగ్గరకు వెళ్ళాడు. సుబ్బిరెడ్డి రెండు మూడేండ్ల క్రితమే ఆ కళాశాలకు ప్రిన్సిపాలుగా వచ్చాడు. అంతకుముందు వో కమిటీ కాలేజీలో చరిత్ర శాఖకు అధిపతిగా పనిచేసే వాడు. మనిషి మంచివాడన్న పేరైతే ఉంది కాని, ఎవరికీ ఏ సహాయమూ స్వయానా చెయ్యలేని స్థితి ఆయనది.

ప్రసన్న వెళ్ళేసరికి సుబ్బిరెడ్డి దొడ్లో టొమేటో మొక్కలు కుదుళ్ళు పెట్టి నాటి స్తున్నాడు. ధోవతి పైకి ఎగగట్టి, బుజాన వో ఉత్తరీయం వేసుకుని, దగ్గర ఉండి స్వయంగా తనాపన్లు చూసుకుంటున్నాడు. కురుకురు మంటున్నాయి కోళ్ళ గూట్లో నాలుగయిదు కోళ్ళు, పెట్టలూ, పుంజాలూ. తోవలనుంచి మసాలావేపుడు వాసన వీధితో

పోయేవాడిని కూడా కట్టి నిలేస్తున్నది.

ప్రసన్నను చూడగానే, సుబ్బిరెడ్డి నవ్వుతూ ఎదురొచ్చి, "ఏంది ప్రసన్నా! అట్ల పోవడం అట్లాగే పోయినావే? క్లాసుగా ఫస్టొచ్చినోడివి గదా, ముందస్తుగా నాకాసంగతి చెప్పొద్దూ?" అన్నాడు. ప్రసన్న ఆయనకు విద్యార్థిగానే తెలుసు.

"అన్ని పన్లు ఒకసారే చేసుకోవచ్చుకదా అని ఇప్పుడొచ్చానండీ!" అన్నాడు ప్రసన్న రెండు చేతులూ జోడించి, వినమ్రత ఉట్టి పడుతుండగా.

"బట్టతలకు ముడేయడానికి వచ్చినావన్న మాట! తస్సాచెక్క, అసాధ్యుడవయ్యా!— దా. దా. పైకి దా. కూసంత కాఫీ తాగుదు గాని." ప్రసన్న మొహమాట పడుతున్నా అతన్ని బలవంతంగా వరండాలోకి తీసుకు వెళ్లి, వో పేము కుర్చీలో కూచోపెట్టి, తనే లోపలికి వెళ్లి, తనకో కప్పు కాఫీ అతనికో కప్పు కాఫీ తీసుకొచ్చి ఇచ్చి, "తాగు మరి! మోమాట పడకు. కొత్త పెళ్లికూతుర్లాగు" అన్నాడు.

"కాదు. కొత్త పెళ్లికొడుకు అనండి!"

ప్రసన్నకు ఆయన దగ్గర అంత స్వతంత్రం ఉంది. తెలివిగల మంచితనం ఉన్న విద్యార్థుల్ని కన్నబిడ్డల్లా చూసుకొనే ఆయన అంటే అంతటి గౌరవమూ ఉంది.

"అవున్సుమా! నువ్వు పెళ్లికొడుకువేగా! ముహూర్తానికి వొచ్చేవోణ్ణే కాని, వాల్తేరులో మీటింగొటి ఉండిపోయిందోయ్! అందుకని రాలేకపోయినాను. బాగా జరిగిందా పెళ్లి!"

"పెళ్లికేంలెండి! బానే జరిగింది. ఆ తర్వాత మొదలైంది అసలు వ్యవహారం...."

"అద్గదీ! అట్ల చెప్పు! ఏం తకరా రొచ్చింది?"

"ఏవో కుటుంబ వ్యవహారాలు!!— విప్పితే ఏం చెప్పండి, ఉద్యోగం అవసరమైంది! మీ దగ్గర కొచ్చాను. కాలేజీలో ట్యూటరు పోస్టేమైనా ఇప్పిస్తారేమోనని!"

ప్రసన్న తాను వచ్చిన విషయం బయట పెట్టేంతర్వాత, నొసలు చిట్లించి, కాసేపు ఆలోచించి, వో చుట్ట వెలిగించుకుని రెండు గుక్కలు పీల్చాడు. "ఉద్యోగానికి తొందరేముందోయ్! డర్టీ జాబ్!—నీలాంటి బ్రిలియంట్ బోయ్ ఎం. ఏ. అవ్వాలి. సెంట్రల్ ఎగ్జామ్స్‌కు కంపీట్ చెయ్యాలి."

"తప్పకుండా ప్రయత్నం చేస్తాను. ముందీ ఉద్యోగం వచ్చేట్లు చూడండి."

ఆయన తలపూపి లోపలకు వెళ్లి, ఫోన్ ఎత్తి ఎవరితోనో మాట్లాడాడు. ఒక అయిదు నిముషా లయింతర్వాత బయటకు వచ్చి, "విష్ యూ ప్రసన్నా! ఇప్పుడే జెడ్పీ



ప్రెసిడెంటు బాపినీడుగారితోటి మాట్లాడాను. నిన్ను పంపిస్తానని చెప్పాలే! ఎళ్లి, ఆయన నెత్తిమీద కూచో. ఆ తర్వాత సెక్రటరీగార్ని కూడా వోసారి కల్సుకో. ఏం?" అన్నాడు.

ప్రసన్న బాపినీడుగారి నెత్తిన కూచో వలసిన అవసరం లేకపోయింది. ఆయనే ప్రసన్నను నెత్తిన పెట్టుకున్నాడు. "నువ్వు మా కాలేజి విద్యార్థివి. పైగా క్లాసులో ఫస్టైనవాడివి! ప్రిన్సిపాల్‌గారు ఇప్పుడే రికమెండ్ చేశార్లే నీ విషయం! తప్పకుండా నీకు ఉద్యోగం యిస్తాను. ఎల్లుండి జాయిన్ అవుదువు."

ప్రసన్న తన అదృష్టానికి తనను అభినందించుకొని, ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకుని, గవర్నింగ్ బాడీ కార్యదర్శిగారింటికి వెళ్లాడు. ఆయన ప్రసన్నను లక్ష ప్రశ్నలు, యక్ష ప్రశ్నలు వేశాడు.

'మీ కుల మేమిటి? గోత్రం ఏమిటి? ఎవరన్నా ఎం. ఎల్. ఏ గాని, యం. పీ. గాని నీకు తెలుసునా? గవర్నింగ్ బాడీలో ఎంత మంది నీకు తెలుసు?' ఇత్యాది ప్రశ్నలు.

ప్రసన్న, అతి ప్రసన్నంగా జవాబు చెప్పాడు. "నాకు ప్రిన్సిపాలుగారు తెలుసునండి!"

ఆ సెక్రటరీగారి మొహం అంత వికసించలేదు. "బాపినీడుగారు నన్ను రెకమెండ్ చేస్తున్నారండీ !"

వెంటనే ఆ సెక్రటరీగారు లేచి, ప్రసన్నతో కరచాలనం చేసి, "అట్లా చెప్పు ! అయితే నువ్వు మా పర్టీయుడి వన్నమాట!—వెరీ గుడ్, రేపే వచ్చి ఆర్డరు తీసుకో" అన్నాడు నవ్వు మొహంతో.

ప్రసన్న లోలోపల నవ్వుకొని, "ప్రెసిడెంటుగారు ఎల్లుండి రమ్మన్నారండీ !!" అన్నాడు.

"అయితే ఎల్లుండే రా! వారిమాట వినడం అంటే, భవిష్యత్తుకు మనం మెట్లు కట్టుకున్నట్టు."

ప్రసన్న అందరిచేతా అవుననిపించుకుని అంచెలమీద తేలిపోతూ, ఇంటికి వచ్చాడు. అతనికి కరకరమంటూ ఆకలి వేస్తున్నది. సూర్యుడు కూడా ఆకలితో ఉన్న సూచనగా ఎండ కూడా మండిపోతున్నది. పక్షులు అరవడంలేదు. రోడ్డు మత్తుగా ఉంది.

ప్రసన్న ఇంటికి వచ్చేసరికి, అతనికి వాతావరణమే మారిపోయినట్లయింది. జమదగ్ని తల పట్టుకుని కుర్చీలో కూచుని ఉన్నాడు. శారదాంబ మొహం గంటుపెట్టుకుని, గుమ్మానికి ఆనుకుని కూచుని ఉన్నది. కళ్యాణి మొహంలో భయం, కళ్లల్లో నీళ్లు. ప్రసన్న అందర్నీ పరిశీలనగా చూశాడు. అడుగుల చప్పుడు విని కూడా ఎవరూ తమతమ మనో ప్రపంచాల నుంచి బయట పడలేదు. ప్రసన్న తండ్రివేపు పరికించి చూశాడు. ఆయన ఒళ్లో పడివున్న ఉత్తరం కంటపడింది.

ప్రసన్న ఆ ఉత్తరం అంతా చదువుకుని "వెయ్యి రూపాయలే!" అన్నాడు అర్థం కానట్టు. అప్పుడు ఎత్తాడు జమదగ్ని తల. అతని వదనం జీవకళ తొలగిపోయినంత అనాకర్షకంగా ఉన్నది. మనిషిలో సత్తువ ఉడిగిపోయినట్టు కళ్లు వాలిపోతున్నాయి. కంఠం వణుకుతోంది. "అవున్రా తండ్రీ ! వెయ్యి రూపాయలే ! వె....య్యి.... రూపాయలు !! ఒకటికాదు, రెండు కాదు వెయ్యి! అమ్మాయి నెక్లెసు తాకట్టు పెట్టాను. దాని లాంఛనాల డబ్బు తీసుకున్నాను! అట్లా కూడబెట్టి ఇచ్చిన డబ్బు !—పారేసుకున్నాట్ట! ఏం ?—చిన్న పిల్లాడా ?—కాదులే—పాపం!— అతను మాత్రం ఏం చేస్తాడు ?—దైవోపహతుడు పోయేవాటికి ఆపదలు కూడా పోతాయట ? ఇది అతని దురదృష్టం కాదు. నా దురదృష్టం ! నన్ను పట్టిన దురదృష్టమే మిమ్మల్నందర్నీ బాధిస్తోంది !!" శారదాంబ కోపంగా అన్నది. "మిమ్మల్ని తిట్టుకుంటూ రెందుకూ ?— కొడుకు చేతికిస్తే అనుభవించడం అతనికి చాతకాక పోయింది తర్వాత? మీ రిచ్చిన వెయ్యి రూపాయలూ పారేసుకున్నామూ— మరోవిధంగా భావించక మరో వెయ్యి పంపించవలసింది అంటే, డబ్బేమైనా యిక్కడ చెట్లుకు కాస్తున్న దనుకొన్నాడా ? తెలివితక్కువ మనుషులూ, తెలివితక్కువ వ్యవహారాలూనూ !"

"అర్థాంతరంగా ఇప్పటి కిప్పుడు వెయ్యి రూపాయలు మళ్లీ ఎక్కణ్నుంచి తెచ్చి పంపించేట్లు ?" ప్రసన్న ప్రశ్నవిని జమదగ్ని అతని వేపు శూన్యదృక్కులతో చూశాడు. "అదే నాకూ అర్థం కావడంలేదు." కూచున్న చోటి నుంచి లేవకుండానే శారదాంబ ఖండితంగా జవాబు చెప్పింది, "మాకే డబ్బుకు ఇక్కడ కష్టంగా వుంది. ఇప్పుడు పంపించడం కుదరదు. అని రాయండి. తిరిగొస్తే తిరిగొస్తాడు. ఆయనిప్పుడు యం.ఏలూ యంయస్సీలూ చదవక పోతే. మనకు గానీ, ఆయనకు గానీ వచ్చిన నష్టమేమీ లేదు."

"కాని లోకం మనను చూచి నవ్వుతుందే? అల్లుణ్ని పంపించనూ పంపించాడు, తిరిగి చదివించలేక వెనక్కు రమ్మనే వాడు, అంటూ మనను చూచే నవ్వుతుంది."

"నవ్వనిద్దురూ, ఎవరో నవ్వుతారని తలకు మించిన బరువెత్తుకుంటే అణగారి పోయేది మనమే!" తల్లి చెప్పిన దానికి ప్రసన్న అవుననీ, కాదనీ అనలేదు. విని మవునంగా వూరుకున్నాడు. జమదగ్నే అతన్ని అభిప్రాయం చెప్పేవరకూ వూరుకోలేదు. "నువ్వూ అట్లాగే అనుకొంటున్నావా ? డబ్బు పంపక్కర్లేదనే అనుకొంటున్నావా ?"

ప్రసన్న కళ్యాణి మొహం వేపు చూశాడు. ఆ కళ్లల్లో నీళ్లు దాగలేక ఇబ్బంది పడుతున్నాయి. తల్లివంక చూశాడు. నిశ్చలంగా వున్నది. అభిప్రాయం చెప్పేసినందున నిబ్బరంగా వున్నది. ప్రసన్న లేచి నిలబడి అటూ యిటూ తిరుగుతూ, మాట్లాడడం ప్రారంభించాడు. "ఇందులో ఒక విషయాన్ని మనం గమనించాలి నాన్నగారూ. అతని కిస్తానన్న కట్నం డబ్బులోంచి కదా చదువుకు డబ్బు పంపిస్తానన్నది. పంపిస్తానని ఒప్పందానికి వచ్చింతర్వాత, నాలుగువేలు కానీ అయిదువేలు కానీ పంపించవలసిందే. ఇహ వెయ్యి రూపాయలు పారేసుకోవడం గురించి! ఇది అతని దురదృష్టం. దానికి మనం బాధపడడం ఎందుకు? తెలివితక్కువతనం అతనిది! ఇహముందు ముందు మాత్రం పారేసుకోడని గ్యారంటీ ఏముంది? అంచేత నాన్న పద్ధతి మంచిదని తోస్తుంది. అతనికి మనం ఇవ్వదల్చుకున్న నాలుగువేలో, అయిదువేలో ఎంతో కొంత, ఆ డబ్బంతా ముందుగా బ్యాంకులో అతని పేర వేసేసి, ఆ బ్యాంకు బుక్కు అతనికి పంపించేసి, 'ఇదిగో మేము నీ కివ్వదల్చుకున్న డబ్బు ఇది! ఇందులోనే నీ పబ్బం గడుపుకో'మని చెప్పడం ఉభయ తారకంగా వుంటుందని నా అభిప్రాయం."

కళ్యాణి అతని వేపు కృతజ్ఞతతో చూసింది. ఆమెకు ఆ క్షణంలో ప్రసన్న ఒక దేవతామూర్తి క్రింద భాసించాడు. ప్రసన్న చెప్పిన సలహా శారదాంబకు అంతగా రుచించినట్లులేదు.

"కుర్రవాళ్లకు అంత డబ్బు చేతిలో వుండడం మంచిదికాదు. డబ్బు, మద్యం కన్నా మనిషిని పిచ్చివాణ్ని చేస్తుంది. శీలాన్ని నాశనం చేస్తుంది."

దూరంగా వున్న వీరభద్రాన్ని గూర్చి అంత తేలికగా శారదాంబ వూహించుకోవడం కళ్యాణికి నచ్చలేదు. "పెద్దన్నయ్య కూడా డబ్బు తీసుకు వెళ్లాడుగా?" అన్నది వ్యంగ్యంగా.

కళ్యాణి అట్లా అనడం చూసి శారదాంబ తెల్లబోయింది. జమదగ్ని మెచ్చికోలుగా

హాతురు వేపు చూశాడు. ప్రసన్నకు మనస్సు చివుక్కుమన్నది.

"అవునమ్మా! నువ్వు చెప్పింది నిజమే. డబ్బు అందర్నీ పాడుచేయదు. కొందర్ని అధఃపాతాళానికి అణగ్రదొక్కినట్లే, కొందర్ని అందలంలో కూడా కూచోపెడుతుంది" అన్నాడు జమదగ్ని ధైర్యం తెచ్చుకుంటూ.

"అది డబ్బులో లేదండీ! మనిషిలో వున్నది. వాడుకునే తెలివితేటల్లో వున్నది."

"అయితే ఏమంటావ్?" జమదగ్ని కటువుగా అడిగాడు.

శారదాంబ అందుకుంది. "అనేందుకేముంది? పంపిస్తే ప్రయోజనం వుండదని అభిప్రాయం." కళ్యాణి తండ్రి వేపు జాలిగా చూసింది. "నాకు మంచో చెడో ఒకటి నిర్ణయించారు. ఆయనతో నా వివాహం తలపెట్టారు. ఆయన అంటే నా మనసులో ఒక భావం ఏర్పడేట్లు చేశారు. భర్త అని గౌరవించమన్నారు. ఇప్పుడు ఆయననే మీరు అవమాన పరుస్తున్నారు. డబ్బు ఇవ్వక, పెళ్లికాక, నేనూ అవమాన పడతాను. నన్నలా అవమాన పర్చకండి నాన్నారూ!" అన్న భావాలన్నీ ఆ కళ్ళల్లో ఆయనకు కన్పించాయి. ఆయన ఏదో దృఢమైన నిశ్చయానికి వచ్చినట్లు తల వూపాడు. "పంపిస్తేనే ప్రయోజనం వుంటుందని నా అభిప్రాయం. అతనూ మంచివాడూ, తెలివి గలవాడూ అని నా నమ్మకం." అన్నాడు.

ఇహ అటు మీదట మాట్లాడడం అనవసరం అనిపించింది ప్రసన్నకు! 'తన నిశ్చయమేదో తను చెప్పాడు. వింటే అందరూ బాగుపడతారు. వినరు?... పైన భగవంతుడే వున్నాడు' అనుకున్నాడు. ఆ ఉదయం, మధ్యాహ్నం ఇంట్లో ఎవరూ మాట్లాడలేదు. అందరి మనసుల్లోనూ మండుతున్న అగ్నిలాగా వుంది బాధ. ఒక్కొక్కరి హృదయమూ ఒక్కొక్క నిప్పుల కుంపటి అయింది. అందరూ జమదగ్ని అన్న ఇనుప స్తంభానికి కట్టుబడిన బలి పశువుల్లా కన్పించారు. చలపతి మాత్రం యధావిధి తన పనులు తాను చేసుకుని, తన ధ్యానంలో తాను వున్నాడు. రాత్రి ఎనిమిది గంటలు దాటింది. యాంత్రికంగా, రాత్రి భోజనాలూ పూర్తయ్యాయి. చలపతి తన పాకలోకి వెళ్ళిపోయాడు. బయట పిండార బోసినట్లుగా వెన్నెల కాస్తోంది. వెన్నెల్లో తడిసి కొబ్బరి ఆకులు మిలమిల లాడుతున్నాయి. దూరంగా పేరు తెలియని పక్షి ఏదో పెద్ద పెట్టున వుండి వుండి అరుస్తోంది. రోడ్డు మీద బిచ్చగాడి కేక. మధ్యమధ్యలో గాలిలో తేలివస్తున్న జోలపాట.

తండ్రీ కొడుకులిద్దరూ దొడ్లో నవాట మీద కూచున్నారు. అప్పుడు ప్రస్తావించాడు ప్రసన్న తనకు ఉద్యోగం రాబోతున్న విషయం తండ్రితోటి. జమదగ్నికి నెత్తి మీద వున్న బరువుల్లో ఒకటి తగ్గిపోయినట్లయింది. "చదువు లేదే! చదువుకున్న కుర్రవాడు ఎదురు గుండా చెడిపోతున్నాడే! అని బాధ వుండేది! నా అసమర్థత మీద నాకే కోపం వచ్చేది! పోనీలే నాయనా భగవంతుడు దయ తల్చాడు! ఉన్న ఊళ్ళోనే నీకు ఉద్యోగం దొరికింది! నా కళ్ళముందే వుంటావు. కలిగిన పాటే సంపాయించుకుంటావ్! అదేచాలు నాకు!!" అన్నాడు ఆనందంతో పొంగిపోతూ!

శారదాంబను పిల్చి ఆ శుభవార్త పెద్దగా చెప్పాడు. కళ్యాణి తోటి, "నీకేం! అదృష్టవంతురాలివే! రామలక్ష్మణుల్లాంటి ఇద్దరు తమ్ములు నీకు! ఇహ నాకు భయంలేదు. ప్రసన్నే నీ విషయం చూసుకొంటాడు. వాడే తన బావకు డబ్బు పంపించుకొంటాడు." అన్నాడు.

"ఉత్తరం సంగతి మర్చిపోయారు. ఎప్పుడో కాదు నాన్నారూ! వెంటనే పంపించమని వుంది అందులో!" అంటూ హెచ్చరించింది కళ్యాణి. ఆ హెచ్చరిక ఎవరికీ సమాధానం చెప్పడానికి కదలించలేదు. కొంచెం సేపు చూసి, కళ్యాణి లోపలకు వెళ్ళిపోయింది. కళ్యాణి వెళ్ళిన తర్వాత "చిన్నపిల్ల! దాని మాటలు నువ్వు పట్టించుకోనక్కర్లేదు." అని కొడుకుతో చెప్పి శారదాంబ తను కూడా వంటింట్లో పని చూసుకోవడానికి వెళ్ళిపోయింది. అక్కడ మళ్లీ నిశ్శబ్దం ఆవరించింది. పైనుండి వర్షంలాగా పడుతోన్న వెన్నెల వాళ్ళ మొహాల మీద నీడలను పరుస్తోంది. వాళ్ళ బొమ్మలు పటువాలుగా పడుతున్నాయి కూచున్న చాప మీద. ముంగిస ఒకటి వాళ్ళ దగ్గరకు వచ్చి, పరిశీలించి పారిపోయింది. వాళ్ళ నిశ్శబ్దం వాళ్ళకే భరించరానిదిగా వున్నది. "ఎట్లాగురా మరి డబ్బు?" అన్నాడు జమదగ్ని సాహసించి.

"పంపించడం తప్పనిసరి అయితే ఎవరినో ఒకరిని ఆశ్రయించడమే!" ప్రసన్న కంఠంలో ప్రొద్దుటి తీవ్రతలేదు. పరిస్థితులను అర్థం చేసుకున్న మనిషిలా కన్పిస్తున్నాడు, అని సంతోషపడ్డాడు జమదగ్ని. అతడు కొడుక్కు కొంచెం దగ్గరకు జరిగి, రహస్యం చెబుతున్నట్లుగా అడిగాడు. "ఒరేయ్! వాళ్ళనూ, వీళ్ళనూ ఆశ్రయించడం దేనికి? చలపతి పొలం వుందిగా? అది తాకట్టు పెట్టి డబ్బు తీసుకువస్తే?"

"అందుకు బాబాయ్ ఒప్పుకుంటాడా?"

(44వ పేజీ చూడండి)



# భారతదేశపు నృత్యరీతులు

అనేక యుగాలనుంచి నాట్యకళ మన దేశంలో శోభాయమానంగా విలసిల్లుతున్నది. విభిన్న జాతులు, మతాలు కలిగిన మన దేశంలో అనేక నాట్య పద్ధతులు ఏర్పడడం ఆశ్చర్యంకాదు. వివిధ ప్రాంతములలో ఆయా ప్రాంతపు సాంప్రదాయములబట్టి నృత్యరీతులు ఏర్పడినవి.

నర్తన అనే నృత్యం మూడు భాగాలుగా విభజింపబడినది. వాటిని నృత్య, నృత్త నాట్యాలంటారు. ఏ భావాన్ని సూచించనిది నృత్తం. భావాన్ని అభివర్ణించేందుకుపక రించేది నృత్యం. అంగ విన్యాసాలతో నాటకీయతను సూచించేది నాట్యం. దీనిలోనే ముఖ కవళికలు కూడా మిళితమై ఉంటాయి.

'కూచిపూడి నృత్యము' ఆంధ్రదేశమున, 'భరతనాట్యము' తమిళదేశమున, 'కథాకళి' మళయాళ దేశమున, 'మణిపురి' మణిపురి ప్రాంతమున, 'ఒడిస్సి' ఒరిస్సాయందును 'అంకియానట్' అసాములోను ప్రసిద్ధి గాంచినవి. నిజానికి ఇవన్నీ కూడా ఒకటి రెండు సామాన్య ధర్మాలని కలిగి ఉన్నవి. ఒక సాంప్రదాయాన్ని పూర్తిగా అనుసరించడమనేది భారతీయనాట్యానికి మూలసూత్రం. శైవప్రచారించిన నృత్య రీతులేగాక 'చా' 'ఉత్కళ' మున్నగు నృత్య రీతులు మన దేశమున ఉన్నవి. కాని అవి చెప్పుకోదగ్గ ప్రచారములో లేవు.

## కూచిపూడి నాట్యం

ఆంధ్రదేశమున ఉద్భవించిన కూచిపూడి నాట్యం చాలా ప్రాచీనమైనది. నవ్య స్త్రీయమైనది. భాగవత రామాయణ సుందర భగవానుని లీలలు ప్రదర్శించు వారిని భాగవతులు అంటారు. కూచిపూడి భాగవతులుగా వారు ప్రఖ్యాతి గాంచుటకు అదియే ముఖ్య కారణము. వారు ప్రచారము చేసిన నాట్యమే కూచిపూడి నాట్యము. యోగి సిద్ధేంద్రస్వామివారు కూచిపూడి వారికి నృత్యము నేర్పిన గురువు. కూచిపూడి నాట్యమును మరింత అభివృద్ధిలోకి తీసుకువచ్చిన 'నాట్య కార్యకర్తలు' శ్రీ వెంపటి వెంకట



రచన: కుమారి మారుతి, కుమారి విజయ.

నారాయణశాస్త్రిగారు, శ్రీ చింతా వెంకట రామయ్యశాస్త్రిగారు, శ్రీ వేదాంతం లక్ష్మీ నారాయణశాస్త్రిగారలు.

కూచిపూడి నాట్యమునకు 'భరతుని నాట్య శాస్త్రము' నందికేశ్వరుని 'అభినయ దర్పణము' ప్రామాణిక గ్రంథములు. కూచిపూడి నాట్యము ప్రార్థనతో ప్రారంభమై మంగళముతో అంతమగును. వీటిమధ్య ప్రదర్శించే అంశాలకు ప్రత్యేక అనుక్రమణిక ఏమీలేదు. నాట్య ప్రారంభమున దేవతాపూజ ప్రార్థన చేస్తారు. హస్తభేదమునకు, పదవిన్యాసమునకు, అభినయమునకు కూచిపూడినాట్యం ప్రసిద్ధికెక్కినది. ఒకవిధంగా చెప్పవలెనంటే ఈపై మూడింటికి సమాన ప్రాధాన్యత ఉండుట చేతనే అన్ని నాట్యములలోనికి కూచిపూడి నాట్యం క్లిష్టమైనదిగా పేర్కొనబడుతుంది.

అభినయం ఆంగికం, వాచికం, ఆహార్యం, సాత్వికం అని నాలుగు విధములు. అవయవములచేత ప్రదర్శింపబడేది ఆంగికం. కావ్య నాటకాదులందు వాక్కులచేత తెలియజేసేది వాచికం. రక రకాలైన అలంకరణలతో అలంకరించుకోవడం ఆహార్యం. సాత్త్వికాది భావాలను తెలియజేసేవి సాత్వికాభినయం. హస్త ముద్రికలతో భావమును స్ఫురింప చేయవచ్చు. కాని ముఖంలో భావం చూపకుండా హస్త ముద్రికలతో అర్థం చూపితే చాలదు. ముఖంలోని అభినయం కలిసినప్పుడే హస్త ముద్రలలో భావం పూర్తిగా సిద్ధిస్తుంది. కూచిపూడి నాట్యంలో ఉపయోగించే హస్త భేదాలను మరి ఏ ఇతర నాట్యాలలోను వినియోగించరు.

కూచిపూడి నాట్యంలో శబ్దములు, జతిస్వరం, తిల్లాన పదాలు, వర్ణాలు, జావళిలు ముఖ్యమైనవి. జతి స్వరంలో లయ ప్రధానము. 'శబ్దం'లో తాళానికి రాగమే కాక, భావం కూడా చేరుతుంది. 'వర్ణం' 'పదము'లలో అభినయానికి ఎక్కువ ప్రాధాన్యం కలదు.

## 'భరతనాట్యము'

కూచిపూడి నాట్యమునకు, భరత నాట్యమునకు అభినయ విషయమున భేదము కలదు. కూచిపూడి నాట్యములో అభినయమునకు ఎక్కువ ప్రాధాన్యము కలదు. భరత నాట్యము నృత్యప్రాయమైన కళ. వివిధ వస్తువులను స్ఫురింపచేయుటకు వివిధ ముద్రలు నిర్దేశింపబడినవి.

దక్షిణాదిన భరత నాట్యానికి చక్కని ప్రోత్సాహము ఉంది. నేడు భరత నాట్య శైలిలో శాస్త్రబద్ధముగా వివిధ క్రొత్త నృత్య నాటకములను మనోరంజకముగా తయారు చేస్తున్నారు. భరత నాట్య ప్రదర్శనము ఒక అనుక్రమణిక ప్రకారం జరగాలి. అనగా ముందు అలరింపు, తరువాత 'జతిస్వరం' పిదప 'శబ్దం'—ఈ క్రమంలో ప్రదర్శింపవలసి ఉంటుంది. అలరింపు సభావందనముగా చెప్పవచ్చును. భరతుడు వివరించిన అడుగుల వరుసలు, హస్తాభినయము నేటికినీ అనుసరింపబడుచున్నవి.

భరతనాట్యాన్ని వెలుగులోనికి తెచ్చినది శ్రీ మీనాక్షిసుందరంపిళ్ళై, శ్రీ పందనల్లూరు గారలు. భరతనాట్యము ముఖ్యంగా ఆట, అభినయము, ఆహార్యము, ఇంపైన పాటల చేత రాణించును. ప్రాచీన కాలమున నర్తకులే పాట పాడుచుండెడివారు. కాని ఇప్పుడు వంత పాట బాగా ప్రచారములోకి వచ్చినది. కూచిపూడి నాట్యము కానీయండి, భరత నాట్యం కానీయండి, అందర్నీ ఆకర్షించడానికి కారణం వాటిలో లయతో కూడిన

కొరకు విన్యాసములకు; విభిన్న హస్తవిన్యాసములు, అభినయం తోడవటం.

## క థ క ళి

కట్టుదిట్టమైన శాస్త్రము కలిగిన 'కథకళి' కేరళయందు విశేష ప్రఖ్యాతి గాంచినది. కథకళి' అనగా ఒక కథను అభినయ పూర్వకముగా ప్రదర్శించుట. ఒక పలుకుగాని, గానముగాని లేకుండా అభినయము 'కథకళి' నర్తకులు వెల్లడింతురు.

ఈ కథకళిని ఎక్కువ ప్రచారములోనికి తెచ్చినవారు నాయర్లు, నంబూద్రీలు. ఇందు నేత్రాభినయము ఎక్కువ. కథకళి నర్తకుల వేషధారణ విధానము (మేకప్) చాలా ప్రత్యేకమైనది. పాత్రల వేషధారణలో ఏమియు తేడా ఉండదు. అనగా రామపాత్రధారి, రావణాసుర పాత్రధారి కూడా ఒకే ఆహార్యమును ధరించియుందురు. అందుచేత ఒక పాత్రను, ఆ పాత్ర ధరించిన వేషముచేత గుర్తించలేము. ఆ పాత్ర నటనవల్లను, భావ ప్రకటనవల్లనూ ఆ పాత్ర ఎవరయినది గ్రహించగలము. కథకళి వేషధారణ చాలా కష్టమయినది. ఎవరికీ వారు రంగులు వేసుకొనలేరు.

ఈ కథకళి నృత్యమునకు సంబంధించిన ప్రామాణిక గ్రంథములు సుమారు 150 వరకు గలవని చెప్పుదురు. కథకళిలో పౌరాణిక కథలు అధికము. తెర వెనుక పాట పాడుచుండగా నర్తకులు ఆ పాట యొక్క, అర్థమును అభినయముద్వారా ప్రజలకు అర్థమగు విధానమున ప్రదర్శింతురు. నర్తకులు తమ నైపుణ్యం చూపుటకు కథకళిలో ఎంతో అవకాశం ఉంది. భయానక, రౌద్ర, వీర, రసాలను ఎంతో చక్కగా కథకళి నర్తకులొప్పిస్తారు. అతి మనోహరమైన ఆహార్య విశేషాలు, విలువైన వలువలు కథకళి నర్తకులకు ప్రత్యేకతను – సంతరించి పెట్టాయి. కాని ఒక్క విషయం చెప్పక తప్పదు. కథకళి నేడు పూర్వకాలములాగా ఆకర్షింపలేకపోతున్నది. దీనికి కారణం 4,5 గంటలు సాగే ప్రదర్శనలు. ప్రదర్శన కాలమును తగ్గించి, నేపథ్య గానములలో వలసిన మార్పులు చేసిన కథకళి ఈ నాటి ప్రేక్షకుల మనస్సు తప్పక ఆకట్టుకొనగలదు.



కూచిపూడి నృత్యభంగిమ 'తిల్లాన': కుమారి విజయ, మారుతి.

## మణిపురి నృత్యం

మణిపురి నృత్యం లావణ్యానికి పేరు గాంచినది. ఆంగికాభినయముతో భావమును ప్రకటించుట మణిపురి ప్రత్యేకత. 'శ్రీకృష్ణ రస సంగీతము', 'శ్రీ గోవింద సంగీత లీలా విలాసములు' మణిపురి నృత్యానికి ప్రామాణిక గ్రంథములు. మణిపురి నృత్య నాటకాలలో కూడా ఎక్కువగా పురాణ గాథలే ప్రదర్శింపబడుతుంటాయి. నర్తకులు రంగు రంగుల దుస్తులు ధరింతురు.

మణిపురి నాట్యం లాస్యంకి పేరుపొందినప్పటికీ, తాండవ నృత్యంకూడా ప్రముఖమైనదనే చెప్పవచ్చును. లాస్యం అనగా స్త్రీలువేయు నాట్యం, తాండవం పురుషులు చేసేది. మణిపురి నాట్యంలో నాట్యంతోపాటు సంగీతం, వంతపాట కూడా ఉత్తమ స్థాయిలో ఉంటాయి. సహజముగా ఒక నృత్యమునకు వాడిన రాగమును మరియొక నృత్యమునకు

(తరువాయి పేజీ మార్జిన్

చిత భూమిమీదే నరకాన్ని రుచి చూపిస్తుంది.''

రాజశేఖరం అమృత హృదయాన్ని శూలాలతో పొడిచిన ఆ సంఘటనలన్నీ ఆమె కళ్ల ముందు సినిమా రీలులా తిరుగుతున్నాయి.

*  *  *

అస్తమానూ అతను దాన్నే చూస్తూ కూర్చుంటున్నాడు అని పెళ్ళిలో పేరంటాళ్లు రాజ శేఖరాన్ని, పార్వతిని చూసి అను కున్న మాటలు అంత అబద్ధమేమీ కాదు.

ఆరోజు రాత్రి కాళ్లకు పసుప్పు, పారాణీ మిస మిసలాడే తెల్లని చీర, రెప రెపలాడే కాటుక కళ్లు, బొడ్డుమల్లె పూలు కుట్టిన బారెడు జడ, తీర్చిన కుంకుమబొట్టు...... రాజశేఖరం వూహాచిత్రంకంటె అందంగా అలంకరించి పార్వతిని గదిలోకితోసి గొళ్ళెం పెడుతూ ఆకు పచ్చ జెండా చూపి నేరు పార్వతీ రాజశేఖరాల సంయుక్త స్వేచ్ఛా జీవిత శకటానికి.

"ఈ క్షణంకోసం ఎన్నాళ్లనుంచి కలలు కంటున్నాను పార్వతీ! నా అంత అదృష్ట వంతుడు ఈ ప్రపంచంలో ఎవరైనా ఉన్నారా?''

మల్లెపూలవాసన మత్తెక్కిస్తూంటే పార్వతి గులాబిరంగు బుగ్గలకు తన పెదవులాన్చి పార్వతితో మొదటిసారిగా రాజశేఖరం మాటాడిన మాటలు. పొంగుతూన్న ఉద్రేకాన్ని అపుకోలేక ఎన్నో మాటలు మాటాడేడు రాజశేఖరం. కాని ఆమె వాలిన కనురెప్ప లను పైకెత్తలేకపోయేడు. ఆప్యాయంగా చేయిందని తెచ్చిన నీలి రంగు ఉంగరం చిగురుటాకు కంటె మృదువైన పార్వతి వ్రేలికి తొడిగి మృదువుగా చుంబించబోగా, పార్వతి విసురుగా చేయి తీసివేసింది. అడుగడుగునా చిన్నబోతూ సిగ్గేమో అనుకున్న రాజశేఖరానికి నిరాశే ఎదురయింది. ద్రాక్షపండు ఆమె పెదవుల కందించబోతే పార్వతి తల ప్రక్కకు తిప్పింది. సిగ్గనుకొని కొంచెం బలవంతం చేయబోతే ఆ ద్రాక్షపండు ఆమె బిగించిన పెదవులవద్దే చితికిపోయింది.

"ఛీ!'' అని పార్వతి తొలగిపోయింది. మరో పది నిముషాలకు పార్వతి జోగడం మొదలు పెట్టింది.

"వెడుకో పార్వతీ!''

రాజశేఖరం మాట వినబడగానే అంగుళం కూడా శరీరం కనబడకుండా ముసుగుతన్ని గోడవైపు తిరిగి పడుకుంది పార్వతి.

ఆమె మనస్సు అర్థంకాక ఏదో సమాధానాలు చెప్పుకొని కళ్లల్లో జ్యోతులు పెట్టుకుని తెల్లవార్చేడు రాజశేఖరం. రెండుమూడు పొర్లు తట్టి లేపగా లేచి అలాగే కళ్లు నలుపు కుంటూ తలుపు తీసుకొని వెళ్లిపోయిన పార్వతిని చూసి ఆ్రపతిభుడయ్యాడు రాజ శేఖరం.

తీరని ఆశల ఆరు రాత్రులు అయ్యేక రాజశేఖరం "నాతో వచ్చేస్తావా?'' అంటే

"నాలుగు నెలలు మావాళ్ల ఇంటిదగ్గర ఉండి వస్తా'' నంది పార్వతి.

పార్వతి ఎడబాటులో జాగ్రదావస్థలో నున్న ప్రతిక్షణమూ రాజ శేఖరం మన సులో పార్వతే మెదులుతూండేది.

ఆమె పుట్టింటి దగ్గరున్న నాలుగు నెలల్లో ఆరు ఉత్తరాలు రాసేడు రాజ శేఖరం. ఉత్తరం వ్రాయడానికి ఒక్కొక్క గంట పట్టేది. మంచి అందమైన కాగితం తీసికొని చక్కని అక్షరాలతో జాగ్రత్తగా పెంటుతో బాటు ప్రేమనంతా ఒలకపోసి వ్రాసేవాడు. ముందు విరహంతోనూ, తరువాత ఉత్తరం వ్రాయమని ప్రతిమాలుతూనూ, తరువాత ఇంకా ఇంకా ఏవేవో అన్ని వారానికి ఒక్కొక్క సారి పోస్టులోవేసి ఆతృతతో ఎదురుచూసే నాడు. రెండు నెలల తరువాత మామూలు ప్రణామాలన్నీ చేసి, తరువాత "ఏమిటి ఉత్తరాలనిండా ఆ పిచ్చి గోల?'' అని వ్రాసి తరువాత "తప్పులుంటే క్షమించవలెను'' అని వ్రాసింది పార్వతి. ఆ ఉత్తరం అందుకొని స్వాభిమానధనుడైన రాజశేఖరం అభిమానపడి తరువాత రెండు నెలల్లోనూ రెండుత్తరాలే వ్రాసేడు. ఒక్కదానికీ జవాబు రాలేదు. నాలుగు నెలల తరువాత పార్వతిని తీసుకు పోదామని వచ్చేడు.

అంత మరీ అత్యాశగా వూహించకపోయినా కనీసం కంటికి చిరునవ్వుతోనైనా కనబడు తుందని ఆశించిన రాజశేఖరానికి నిరాశే అయింది. రాత్రి పదకొండు గంటలకు "వెళ్లవే! లోపలికి, బాగుండదు!'' అని తల్లి బుజ్జిమంటూంటే గుణుస్తూ లోపలికు వచ్చిన పార్వతిని చూడగా రాజ శేఖరం మన స్సులో మంట వణుకొని పలకరించలే యాడు.

"నాలుగు నెల్లంటే సరిగ్గా నాలుగు నెలల తరువాతే వచ్చేయాలేమిటి?'' కోపంగా చూసింది పార్వతి అతని కళ్లలోకి.

ఇష్టం లేకపోతే అప్పుడే రానని చెప్పినా అంత బాధ పడేవాడు కాదేమోగాని వచ్చిన వాణ్ణి సరైన మర్యాదైనా చేయకుండా "అప్పుడే వచ్చేయా లేమిటి'' అని అడగ్గానే రాజశేఖరం చాలా బాధ పడ్డాడు. ఎందుకో ఆ యింట్లో అందరూ అంటే ఒక రకమైన అసహ్యభావం ఏర్పడిం దతనికి.

"ఇంకా చిన్న వయస్సు ఇద్దరికీ కూడా! ఇంకో నాలుగైదు నెలలు పోయిన తరువాత పెట్టుకోకూడదుటోయ్ కాపురం!'' మామ గారు మర్నాడు పొద్దున్న మాటల ధోరణిలో అన్నారు రాజశేఖరంతో

అతను మాటాడలేదు.

"ఎందుకంటే నువ్వు కాలేజీకి వెడతావా! పిల్ల ఒకర్తీ ఇంట్లో ఉంటుంది. కొత్త వూరు. ఇంకా కొన్నాళ్లపోతే.... అర్థోక్తిలో ఆగిపోయారు ఆయన.

"మీ యిష్టం.'' అనేసి రాజశేఖరం తన గదిలోకి వెళ్లిపోయాడు.

అల్లుడికి కోపం వచ్చిందనుకున్నారు అత్తగారూ మామగారూ. అందుకనే చివరకు ఇష్టం లేకపోయినా రాజశేఖరంతో ప్రయాణం కావలసి వచ్చింది పార్వతికి.

బస్సులో ముందు ఎక్కి ఆడవాళ్లసీట్లలో కూర్చుంది పార్వతి.

"ముందుకు నడు పార్వతీ! ఇద్దరం ఒక సీటులో కూర్చుందాం!'' అన్నాడు రాజశేఖరం

"ఇంతమందిలో నేను కూర్చోలేనుబాబూ మీ ప్రక్కను!''

పార్వతి అంటూంటే నలుగురూ తన వైపే చూస్తున్న రాజశేఖరం తల కొట్టి నట్లయింది. కట్టుకున్న పెళ్లాం, ప్రక్కను కూర్చోడానికి సిగ్గుపడడమా! ఛీఛీ! వెళ్లి మాట్లాడకుండా ముందుకుపోయి తన సీటులో కూర్చున్నాడు.

పెళ్ళయిన తర్వాత మొదటి ఆరురాత్రులే

కాదు కాపురానికి వెళ్లిన ఆరు నెలల్లో కూడా అంతకంటె సన్నిహితంగా వెళ్లలేక పోయేడు రాజశేఖరం పార్వతికి.

పార్వతి చేతులకు, ఉత్సాహంతో పరుగులు పెట్టిన రాజశేఖరం మనస్సు పూర్తిగా గాయపడింది. కాని యువ్వనోద్రేకంతో ఉరకలెత్తుతున్న అతని శరీరం అతని అధీనం కాలేదు. అతనికి తెలియకనే అతని చేతులు పార్వతి శరీరాన్ని తడిమేవి. ఆమె చేయి విసిరి కొట్టడంతో ఆత్మాభిమానం దెబ్బతిని, ఆమె మీదా, తనమీదా, యావత్ప్రపంచం మీదా అసహ్యించుకొని కోరికల సెగలతో కుమిలి కుమిలి ప్రక్కకు తిరిగి పడుకొనేవాడు.

ఆరోజు రాజశేఖరం కళ్ళు అతని మనస్సును జయించేయి. అసమాన సౌందర్యవతి యైన పార్వతి గులాబిరంగు శరీరపు వంపు సొంపులన్నిటిని అతని చూపులు తలుపు సందులోంచి దాహంతో వెదుకుతున్నాయి. ఆమె ఒక్క క్షణం కనుమరుగైంది. తిరిగి వస్తుందని ఎదురుచూసేలోపలే భళ్ళున తలుపు తెరుచుకొంది. రాజశేఖరం దొరికి పోయాడు. "ఛీ సిగ్గులేకపోతె సరి! ఏమిటీ పాడు పన్లు!" రాజశేఖరం తట్టుకోలేని దెబ్బ తగిలింది. పార్వతి అసమాన సౌందర్యమే అన్ని అవమానాలూ భరించేలా చేసింది.

"నీకు దొరికిపోయాననికాదు పార్వతీ బాధపడేది! కట్టుకొన్న పెళ్ళాన్ని కూడా ఇలాగే చూడాల్సి వస్తోందని."

మొదటిసారిగా అతనికి తెలీకుండా అతని నోట్లోంచి ఒక బాణం వచ్చేసింది. పార్వతి అక్క కమల నాలుగు రోజులు పార్వతి దగ్గర ఉండిపోదామని వచ్చింది. రాజశేఖరం మామూలుగా [illegible] కాలేజీకి వెళ్ళిపోయాడు.

తిరిగి రాజశేఖరం వచ్చినట్లు పార్వతి కమలం కూడా గమనించలేదు. రాజశేఖరం తన [illegible] కూర్చున్నాడు.

"[illegible]?" అంది కమల పార్వతి అక్క.

"ఛీ [illegible]? అదేమీలేదు" అంది పార్వతి.

"[illegible] కట్టూ, శాంతి చేసుకున్నావ్! [illegible] యెందుకే?"

"నాకు తెలీదేమిటే? అదేమీ లేదు."

"ఏమిటే నీకు తెలిసింది?"

"నాకు తెలుసు. ఇప్పటిదాకా ఆయన్ని మీద చెయ్యి వేయనివ్వలేదు."

ఒక్క క్షణం దాకా కమల మాట్లాడలేదు.

"ఛీ! మనిషివేనా నువ్వు! చెప్పేందుకైనా సిగ్గు లేదూ!......" ఇంక రాజశేఖరం వినలేకపోయాడు. ఎలా వచ్చేడో అలాగే బయటకు వెళ్ళిపోయేడు. ఆతర్వాత రాత్రి రాజశేఖరం చేతిని పార్వతి చేయి విసిరికొట్టలేదు. శారీరకంగా రాజశేఖరం కోరిక తీరినా అందులో అతనికి ఆనందం లభించలేదు. ఏదో లోటు. అతనికే తెలియదు.

తరువాత ఆరు సంవత్సరాల్లోనూ పార్వతికి మూడుసార్లు గర్భస్రావం జరిగింది. మూడోసారి పరామర్శించవచ్చిన మేనత్తతో పార్వతి అన్న మాటలు రాజశేఖరం చెవిని పడ్డాయి.

"మగాళ్లకేం మహా రాజాలు! అవతలి వాళ్ళ సుఖం, దుఃఖం చూడకుండా కోరికలు తీర్చుకుంటారు. పిల్లికి చెలగాటం ఎలుక్కి ప్రాణ సంకటమూనూ"

"అయితే పార్వతి దాంపత్య జీవితాన్ని ఇంతకుమించి అర్థం చేసుకోలేకపోయిందా? తన్ను గురించి ఇంత నీచంగా ఆలోచించిందా? అందులోనూ పరాయి వాళ్ళ ముందు తన్ను గురించి ఇంత నీచంగా మాట్లాడుతుందా? ఛీ! పార్వతి మనిషి కాదు" రాజశేఖరం మనస్సు పూర్తిగా చలించిపోయింది. ఇకపై పార్వతి శరీరాన్ని తాక కూడదని ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. ఆ తరువాత రాజశేఖరం ఎన్ని నిద్రలేని రాత్రులు గడిపేడో పార్వతికి తెలీదు.

రాజశేఖరం కూడా ఇంటికి ఏ స్నేహితులనైనా, లేక లెక్చరర్స్‌నైనా తీసుకొని వస్తే, ఏదైనా టిఫిన్ చేయడానికి కూడా కస్సు బుస్సుమంటూండేది పార్వతి.

అతడు ఏ మనిషినైనా అర్థం చేసుకొని గాని మంచి చెడు చెప్పొద్దంటాడు. మనిషిని చూస్తేనే మంచి వాడో చెడ్డవాడో తెలిసిపోతుందంటుంది పార్వతి. మనకు లేనప్పుడు లేనట్టుగానే ఉండడంలో తప్పు లేదంటాడతను. దరిద్రులమైనంతమాత్రాన దరిద్రులమని చెప్పుకుంటామా అంటుందామె.

టిఫిన్ చెయ్యమని చెప్పాలా? ఎప్పుడు చేయాలో మానాలో ఆడదానికి తెలీపోతే ఎలాగనుకుంటాడు రాజశేఖరం.

ఏదైనా కావలిస్తే చేయమని చెప్పాలి. మనసులోవి మనసులో ఉండగానే తెలిసిపోతాయా అంటుంది పార్వతి.

కుంపటి అంటించినది మొదలు కూరలో వేసే కారం వరకూ, భోజనం చేయవలసిన టైము దగ్గర్నుంచి రాత్రి నిద్రపోవలసిన టైము వరకూ అన్నీ అభిప్రాయభేదాలే.

నిత్య జీవితంలో రోజూ గడిపే ఇరవై నాలుగు గంటల్లోనూ తన ప్రక్కనున్న పార్వతిని ఎన్నో భంగిమలలో ఊహించుకుని కలలు కన్నాడు రాజశేఖరం. ఒకదాని వెనుక ఒకటి రోజు రోజుకూ కల్లలుగా నిరూపింపబడుతున్నాయి.

పార్వతితో మార్పుకోసం ఎదురు చూచి చూచి విసిగి వేసారిపోయిన రాజశేఖరం ఇంచుమించుగా వైరాగ్య జీవితానికి అలవాటు పడిపోయాడు. అతని ఉద్దేశ్యంలో ఒక మనిషి సుఖ సంతోషాలను దోచుకునే అధికారం మరో మనిషికి లేదు. పార్వతి వలన తనకే జీవితంలో ఏలాగూ సుఖం లేదు. తాను కూడా అలాగే ఎందుకు ప్రవర్తించాలి? పోనీ! ఆమెనైనా సుఖపడనీ! అందుకనే తన మనస్తత్వానికెంత విరుద్ధమైనా ఆమె కిష్టమైనట్లే వ్యవహరించడం మొదలు పెట్టేడు రాజశేఖరం. మూడు నెలల కోసారి యాభై రూపాయలు చీరల కని ఆమె కిచ్చేవాడు. ఏమి చేసేవని అడిగే వాడుకాదు. ఇది వండు అది వండు అని ఎప్పుడూ చెప్పలేదు. వారానికోసారి షాపులో ఏవో తిను బండారాలు కొనుక్కొస్తూనే ఉండేవాడు. ఆమె పెట్టుకున్నా పెట్టుకోకపోయినా రోజూ రెండణాల పువ్వులు తీసుకొస్తూండేవాడు. తలపు వచ్చినప్పుడు

ని పార్కుకైనా వెడదామా అని అడిగేవాడు. ఏ పదిహేను రోజులకో సినిమాకు వెడదామా అని అడుగుతూండేవాడు. వచ్చినప్పుడు తీసు కెళ్ళేవాడు. లేకపోతే ఏమీ తోచకపోతే అప్పుడప్పుడు తానే వెళ్ళేవాడు. తానివికాక ఏమైనా పార్వతిదెప్పినా కొత్తలో వాదించేవాడుగాని తరువాత వద్దంతో పిల్చినట్లు దున్నలా మాట్లాడేవాడుకాదు. పాలు గైదుపోస్తే నగలు నగలంటూండని బ్యాంకులో డబ్బు తీసుకొచ్చి ఆమెను తీసుకొని వెళ్ళి రాళ్ళ నెక్లెస్ కొన్నాడు.

"పార్వతికోసం నేనేమి చేస్తున్నా అది ఆమెయందు గల అనురాగంతోకాదు. పార్వతిని ఒకరోజు ఆరాధించినా ఈరోజు నిజం చెప్పాలంటే ఎంతో ద్వేషిస్తున్నాను. ఆమె ఎంత అందమయినది అయినా నా కంటికి అందంగా కనిపించడం మానివేసింది. నేనామెకోసం ఏమి చేసినా అది నా కర్తవ్యం దృష్టితోనే!!'' అని రాజశేఖరం తన డైరీలో వ్రాసుకున్నాడు ఆ నెక్లెస్ కొన్న రోజున.

కాని ఆనాటికీ ఈనాటికీ రాజశేఖరం భరించలేనిది ఆమె తన వాళ్ళమాట ఎత్తినప్పుడే. "నేను మీ వాళ్ళను గురించి మాట్లాడలేదు. నీకు మా వాళ్ళను గురించి మాట్లాడే అధికారంలేదు. వాళ్ళను పల్లెత్తు మాటన్నా నీకీ యింట్లో చోటుండదు. నీ యిష్టం." ఈ మాటలతో పార్వతి అటువైపు దాడి చెయ్యడం మానివేసింది.

ప్రపంచంలో స్థిరమైన, బలమైన నిజ రూపాలే ఎక్కువ కాలం ఉంటాయి. వటువలు, కల్పిత రూపాలు, వాటితో జీవించలేవు. ఎన్ని విస్మయాల్లోనూ కాలగమనంతో సత్యం అసత్యాన్ని జయించి తీరుతుంది. తలి దండ్రులు పెంచిన ఆస్తుల పంపకం జరిగేటప్పటికి ఎంత వద్దనుకున్నా తనతోడబుట్టిన వారిలోని కరడు గట్టిన స్వార్థం చూడకుండా ఉండలేకపోయింది పార్వతి. ఆమెకు తెలీకుండానే ఆమె మనస్సు మనుష్యలను మనుష్యులతో పోల్చడం మొదలు పెట్టింది. అన్ని కోణాలోనూ చివరివరకు నిల్చింది ఆమె మనస్సులో రాజశేఖరమే. ఆ సమయంలో అతని డైరీలు చిత్రించిన అతని అనుభవాలు ఆమె మనస్సును చిత్రహింస చేశాయి. ఆమెమీద ఆమెకే విపరీతమైన జుగుప్స కలిగింది. ఈ మాలిన్యాన్ని అతని సేవలతో కడుగుకోలేకపోతే ఆమెకు తృప్తిలేదు.

పార్వతికి ఇన్నేళ్ళు గడిపిన తన జీవితం కంటె కొద్ది రోజులు జీవించిన ఆ గులాబి పూవు జీవితం ధన్యమనిపించింది. కను చీకటిపడుతూంటే అక్కడనుంచి లేచింది పార్వతి.

* * *

కాలేజీ పనిమీద హైదరాబాదు వెళ్ళేడు రాజశేఖరం పది రోజులక్రితం. ఆరోజు రాజశేఖరం రావలసిన రోజు. రాత్రి పదిగంటల దాకా చూసి నిద్రపోయింది పార్వతి.

పార్వతికి మెలుకువ వచ్చేటప్పటికి దూరంగా కోడి కూత వినబడుతూంది. ఆమె ఉలిక్కిపడి లేచింది. ఆమెకు అస్పష్టంగా గుర్తుకు వస్తూంది రాత్రి రాజశేఖరం తలుపు కొట్టినట్లూ,తాను తలుపు తీసినట్లూ. మామూలు అలవాటు ప్రకారం నిద్ర కళ్ళతో వచ్చి పడుక్కొని మొద్దు నిద్రపోయింది. అయినా అనుమానం తీరక అతడు పడుక్కొనే గదిలోకి వెళ్ళి చూసింది. ప్రయాణ బడలికవల్ల రాజశేఖరం గాఢంగా నిద్ర పోతున్నాడు. పార్వతి దగ్గరగా వెళ్ళి చూసింది. అతనంటే ఆమెకు విపరీతమైన ప్రేమ కలిగింది. పంవత్సరాల తరబడి పేరుకున్న విరాగం అతని వాడిన ముఖంలో ప్రతిబింబిస్తూంది. అతని నిరసించిన ముఖంలో నవ మన్మథుని అందాలన్నీ కనబడుతున్నాయి ఆమెకళ్ళకు. ఎడారిలాంటి ఆమె మనస్సులో ఈరోజు ప్రేమ వాహిని పరవళ్ళు తొక్కుతూ పరుగెడుతూంది. ఆమె పరిసరాలు మరచి పోయింది. "నా స్వామి ఎంత అందమైనవాడు. ఎంత మంచివాడు. ఎంత అమాయకుడు. పాపిష్ఠిదాన్ని అయిన్నా ఎంత కష్టపెట్టేను." విచిత్రంగా అతని కష్టాలకు ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండిపోయాయి. "క్షమించండి! ఇంక ఒక్క క్షణం మిమ్మల్ని వదలి ఉండను. ఉండలేను. మీ సేవలో నే ప్రపంచాన్నే మరచిపోగలను." ఉప్పొంగి పొర్లుతూన్న ప్రేమ తరంగాలు బాష్పరూపంలో ఆమె చెక్కిళ్ళమీదినుంచి జారిపోతున్నాయి. అతని కాళ్ళ దగ్గరకువచ్చి వంగి మనసారా భక్తితో ఆమె కనురెప్పలు అతని పాదాలకు తాకాయి. అతను కొంచెం కదిలేడు. పార్వ














# హింస

వెనక్కు తప్పుకుంది. ఆమెకు బాహ్యస్మృతి కలిగింది. ఇంకొంచెం సేపుపోతే అతను లేచి పోతాడు. మాట్లాడకుండా మూగ దేవుడులా లేచి ఎముకలు కొరికే చలిలో కాలకృత్యాలు తీర్చుకొని తెల్లవారకుండానే స్నానం చేసే స్తాడు. వెంటనే వెళ్ళిపోయి తన గదిలో కూర్చుని కడుపులో ఎలుకలు పరుగెడు తూన్నా నోరు మెదపకుండా ఏదో చదువు కుంటూ కూర్చుంటాడు. "అన్నంపెట్టేను" అని తానంటే నిశ్శబ్దంగా వచ్చి ఏమీ విమ ర్శించకుండా ఇష్టమైనది తిని, లేనిది వదిలేసి వెళ్ళిపోతాడు.

పార్వతి త్వరగావెళ్ళి కాగులో నీళ్ళు పోసి క్రింద మంట పెట్టింది. తెల్లవారితే ఆది వారమని గుర్తుకు వచ్చింది. వెంటనే కుంపటి అంటించింది టిఫిన్ చేయడానికి. మధ్యలో రెండు మూడు సార్లు అతను లేచాడేమో అని చూడడానికి వెళ్ళింది. గోధుమపిండి పిసికి పెట్టింది. మళ్ళీ వచ్చి చూస్తే అతను మంచంమీద లేడు. అతను తిరిగి వచ్చేటప్ప టికి పెట్టెలోంచి ఇస్త్రీ తువ్వాలు తీసి, టూత్‌బ్రష్‌మీద పేస్ట్ వేసి అతని కిచ్చింది. అతను తెల్లబోతూ అవి తీసుకున్నాడు. పళ్ళు తోముకొని వచ్చేసరికి వేడి నీళ్ళు తోడి పెట్టింది. రాజశేఖరం మామూలుగా బావి దగ్గరకు పోతూంటే "వేడి నీళ్ళు తోడేను. ఇటురండి!" అని పిలిచింది. అతను ఏదో అడుగుదామనుకున్నాడుకాని మాటాడలేక పోయాడు. అతను సబ్బుతో తోముకుం టూంటే వీపుతోముదామని దగ్గరకు వెళ్ళిందికాని కొంచెం సిగ్గనిపించింది. ఎప్పుడూ అలవాటులేని పని చేయడానికి మళ్ళీ ఆమెమీద ఆమెకే చికాకు పుట్టింది. వెంటనే కొంగు బిగించి మాటాడకుండా అతని చేతిలో సబ్బు తీసుకొంది. అతను ఆశ్చర్యంతో నిరుత్తరుడై గుడ్లప్పగించి అలాగే చూస్తున్నాడు. అతన్నిచూస్తూంటే ఎంతో జాలి కలుగుతూంది పార్వతికి. అతని చూపు చూసి నవ్వు వస్తూంటే మునిపళ్ళతో పెదవులను నొక్కిపట్టింది.

"ఏమి టిదంతా?" చివరకు ఉండబట్ట లేకపోయాడు.

"ఏదంతా?" ఆమె తలెత్తకుండానే అడిగింది.

బలవంతంగా అతని చేతిలోని తువ్వాలు లాక్కుని తల, వీపు, వళ్ళు తుడిచి తువ్వా లతని కిచ్చి తాను బయటకు వచ్చింది.

పూర్తిగా తెల్లవారింది. అతను మామూ లుగా అతని గదిలో కూర్చున్నాడు. కాని మామూలుగా చదువుకోటంలేదు. అతని మూగ తపస్సు కీ రోజు భంగం కలిగినట్లుంది. కిటికీలోంచి దూరంగా చూస్తున్నాడు. ఒక ప్లేట్లో చపాతీలు, ఒక ప్లేట్లో కూర తీసుకొచ్చి టేబుల్‌మీద పెట్టింది పార్వతి. రాజశేఖరం ఆశ్చర్యం ప్రకటించలేదు ఆశ్చర్యపోయినా. మంచినీళ్ళ గ్లాసు తీసుకొని అతని గదిలోకి వెళ్ళబోతూ ఒక్క క్షణం ఆగింది పార్వతి. దీనికి కారణం ఏమిటన్న ట్లుగా అతనా ప్లేట్ల వంక చూస్తున్నాడు. ఆ చూపులో కుతూహలమే కనబడుతూంది. పార్వతి అడుగుల చప్పుడు విని కూడా అతను దృష్టి మరల్చలేదు. పార్వతి గ్లాసు టేబుల్‌మీద పెట్టి అతని కెదురుగా కూర్చుంది. "తినండి!" అందామె అతని ముఖంలోకి చూస్తూ.

"ఇవ్వేళ ఏమైనా......" అర్ధోక్తిలో ఆగి పోయా డతను పూర్తి చేయమన్నట్లు ఉద్దే శిస్తూ.

"ఏమి లేదు" అంది పార్వతి అదో రక మైన సంతృప్తితో.

"తినండి!" ప్రాధేయపూర్వకంగా మళ్ళీ రెట్టించింది పార్వతి.

"నువ్వు తినవా?" అన్నా డతను ఆమె వైపు చూసి.

"మీరు తిన్న తరువాత తింటా!" అని మళ్ళీ అలా అంటే అతన్ని చిన్నబుచ్చినట్లవు తుందేమోననిపించి "నేను కూడా తెచ్చు కోనా! ఇదిగో ఇప్పుడే వస్తున్నా!" అని తను కూడా తెచ్చుకొని కూర్చుంది.

భోజనం దగ్గర కూడా రాజ శేఖరాన్ని పార్వతి ఎంతో ఆశ్చర్యపరచింది. అతని కిష్ట మైన వంటకాలన్నీ బెండకాయకూర, కొబ్బరికాయ పచ్చడి, పప్పు పులుసుతయారు చేసింది. అదికాక స్పెషల్ సేమియా పర

మాన్నం. భోజనం అయి ఈజీ ఛైర్‌లో కూర్చోగానే పార్వతి తమల పాకులు తీసు కొచ్చింది. "నీ కీ రోజు ఏదో పిచ్చెక్కి నట్లుంది. నేను తాంబూలం వేసుకోడం ఎన్నాళ్లయింది నువ్వు చూసి?" అన్నాడు రాజశేఖరం.

"పోనీలెండి పిచ్చెక్కితే! ఈ పిచ్చి ఇలాగే ఉండిపోతే మీకేమీ అభ్యంతరం లేదుగా" అతను చేయి చాచకపోతే ఆమె నోట్లో పెట్ట బోయింది.

రాజశేఖరం ఎందుకో వెనక్కు తప్పుకుని చేత్తో తీసుకుని నోట్లో పెట్టుకున్నాడు. ఇప్పుడు మాత్రం ఆమె ముందు అతనికి సిగ్గు పుడుతూంది. తనకు తానై తన శరీరం తాకనిస్త్రీ, చేయి వేయని స్త్రీ, నోట్లో నవ్వుతూ తాంబూలం పెడుతూంటే సిగ్గు వెయ్యదూ!

బతిమాలుతూన్నట్లుగా "మధ్యాహ్నం ఏదైనా సినిమా కెడదామండీ?" అంది పార్వతి.

"ఇన్నాళ్లకు నీకు సినిమా చూడాలని పించిందా?"

"అవును. మీతో చూడాలనిపించింది!"

మధ్యాహ్నం ఇద్దరూ సినిమా కెళ్లారు. పార్వతి అతని కిష్టమయ్యేవిధంగా ముదురు నీలి రంగు పట్టు చీర, అదే రంగు రవిక తొడుక్కుంది. కంఠం చుట్టూ అతను కొన్న రాళ్ల నెక్లెస్ పెట్టుకుంది. నిజంగా పార్వతి కొంచెం వయసు మళ్లినా అత్యంత సౌందర్యంగా ఉంది.

రాత్రి భోజనంచేసి ఏదో చదువుకుం టూంటే తెల్లని మల్లు చీర కట్టుకొని, తలనిండా సన్న జాజి పూవులు పెట్టుకుని, మళ్లీ తమలపాకులు తీసుకొని వచ్చింది పార్వతి. ఆమె ముఖం స్వేచ్ఛగా చూడ డానికి కూడా సిగ్గనిపిస్తూంది రాజశేఖ రానికి.

"మళ్లీ ఇప్పుడు తాంబూలమా? నాలిక మొద్దుబారిపోతుంది."

"ఒక్క రోజుకు ఏమీ మొద్దుబారదు లెండి! వేసుకోండి!"

గులాబిరంగు ఆమె ముఖంమీద ఎర్రని దొండపండులాంటి పెదవులు.... రాజశేఖరం మనస్సులో అతని గత అనుభవాలతో పోసి పోయివుంటే.....

ఆమె సౌందర్యాన్ని ఆరాధిస్తూ అతను పరిసరాలు మరచిపోయేవాడే. ఆమె శరీరానికి దూరంగాఉన్న ప్రతి క్షణమూ పరితపించే వాడే. కాని అతని మనస్సులో హృదయ విదారకమైన అతని అనుభవాలు శిలాక్షరాలులా కదులుతున్నాయి. ఈరోజు ఆమె సేవలలోని పరిపూర్ణత్వాన్ని, అతనిపట్ల ఆమె మనస్సుల్లో పరవళ్లు తొక్కుతున్న ప్రేమ వాహినిని, వయసుతోపాటు మాయక మెత్తని మెరుగులు దిద్దుకున్న ఆమె శరీరంలోని అతి సుందర రూపాన్ని అతను గుర్తింత లేనంత అశక్తుణ్ణి చేస్తున్నాయి. అతని అనుభవాల జ్ఞాపకాలు.

పుస్తకం మీదనుంచి తన చేయి తీయ కుండానే ఆమె చేయి తాంబూలాన్ని అతని నోటితో పెట్టింది. అతని చేతిలో పుస్తకాన్ని తీసి మూసివేసింది పార్వతి. అతని కుర్చీకి దగ్గరగా ఒక స్టూలు వేసుకొని కూర్చుంది.

రాజశేఖరం కర్తవ్య మూఢుడై అలాగే కూర్చున్నాడు.

"ఎన్నో రోజులనుంచి ఎన్నో పుస్తకాలు చదువుతున్నారు. వాటిలో నాకు చెప్ప తగినదేమీ లేవా?" దేవునివైపు భక్తుడు చూస్తూన్నట్లు రాజశేఖరం ముఖంలోకి చూస్తూ అడిగింది పార్వతి. కొంచెం ఆలోచించాడు అతను.

"ఒక చిన్న పురుగు జీవించిన శంఖంలో సముద్రంలో నీటినంతటినీ ఇమడ్చాలంటే సాధ్యమవుతుందా?" రాజ శేఖరం ఆమె వైపు చూడకుండానే అన్నాడు. అతను చేసిన నింద ఆమెకు అర్థమయింది. ఆమెకు కోపంరాలేదు. ఆమెను ఎన్ని మాటలన్నా, ఏం చేసినా ఆమెకు కోపం రాదు. ఇప్పుడు అతనిపై ఆమె భక్తి అటువంటిది.

"పోనీండి! సముద్రంలో నీళ్లన్నీ కాకపోయినా పట్టినన్ని నీళ్లయినా పొయ్యొచ్చుగా!"

"అందులో పురుగు చావనిదే ఏదైనా పోయడాని కెలా సాధ్యమవుతుంది"

"ఏమండీ! శంఖంకంటె, సముద్రం కంటె, పురుగు జీవితం అల్పంకాదూ! అది ముందే నశిస్తుందిగా......"

"అది నిజమే. కాని పురుగు చనిపోయేటప్పటికి నీళ్లు పోసేందుకు ఒకరు సిద్ధంగా కాచిపెట్టుకుని ఉంటారనేమిటి?"

అప్రయత్నంగా పార్వతి కళ్లనిండ నీళ్లు నిండాయి.

"పోనీండి! మీతో నాకు వాదనెందుకు?" పార్వతి రాజశేఖరం చేయిపై తన చెక్కి

(43 వ పేజీ చూడండి



# గోవా జానపద గాథలు-కథకులు

రచయిత
వి.ఎస్. సుఖ్తంకర్
అనువాదం
పాలగుమ్మి పద్మరాజు

[జానపద గాథలు సామాన్యంగా మారవు. గోవా ప్రజలు ఈనాటికీ ఈ కథలను చెప్పుకుంటూ ఉంటారు. అయితే ఆ చెప్పుకునే ప్రజల జీవితాలు ఎంతగానో మారిపోయాయి. ఈ రచనల్లో ప్రతిబింబితమయ్యేది నలభై ఏళ్ళ క్రిందట ఈ రచయితను, అతని చిన్నతనంలో, ముగ్ధుణ్ణి చేసిన సామాజిక వాతావరణం. ఆనాటి గోవా జీవితానికీ రచనలు ప్రతిబింబాలు. చదువరులు అది మనసులో ఉంచుకుని ఈ రచనలు చదవాలని రచయిత మనవి.]

ప్రతి జానపద గాథలు చదివేవారికి గోవా గురించి కొద్దిగా చెప్పాలి.

గోవా భారతదేశం పశ్చిమతీరం మీద ఉండే ఒక చిన్నదేశం. ఈ పచ్చనిసీమ వైశాల్యం 1400 చదరపు మైళ్ళు. నిలువుగా అరవయి మైళ్ళ, అడ్డంగా ముప్పయి మైళ్ళ కన్నా కూడా ఎక్కువగా ఉండదు. ప్రపంచంలోకెల్లా సుందరమయిన ప్రదేశాలలో ఒకటయిన గోవా తూర్పున పశ్చిమ గిరులు, పడమట అరేబియా సముద్రమూ ఉంటాయి. తూర్పునే సహ్యాద్రి కొండలు కూడా ఉంటాయి. ఇక దక్షిణం వైపు కెనరా జిల్లా, ఉత్తరాన టిరాకోల్ నదీ ఉంటాయి. జనాభా ఆరులక్షలు. ఇందులో 60 శాతం హిందువులు, 40 శాతం క్రైస్తవులు. సంవత్సరానికి 105 అంగుళాల వానతో, దట్టమయిన వృక్ష సంపదతో, కొండలతో, లోయలతో, నదులతో, జలపాతాలతో చూపరులని సమ్మోహింప చేసే ఈ ప్రదేశాన్ని ఇంగ్లీషులో 'లాండ్ ఆఫ్ ఎన్చాన్ట్‌మెంట్' అన్నారంటే ఆశ్చర్యంలేదు.

ఒకదేశం మానసిక అభివృద్ధిని అక్కడి అక్షర జ్ఞానం కలవారి సంఖ్యని బట్టికాక అక్కడి జానపద సాహిత్యాన్ని బట్టి నిర్ణయించేట్లయితే, గోవా సంస్కృతి కల దేశమనే అనాలి.

ఏ దేశం జానపద సాహిత్యమయినా ఆదేశం సునో ప్రవృత్తిని ప్రతిబింబిస్తుంది. కాని అక్కడి సాంఘిక పరిస్థితి ఈ ప్రతిబింబం ఎంత స్పష్టంగా ఉండాలో నిర్ణయిస్తుంది. గోవా జానపద సాహిత్యం విశిష్టతకి కారణం అక్కడి ప్రజల జీవితంలో కనిపించే ప్రత్యేక అంశాలేనేమో!

ముఖ్యమయిన మూడు అంశాలలో మొదటిది భాషకి సంబంధించినది. గోవాలో క్రైస్తవులూ, హిందువులూ కూడా 'కొంకణి' మాట్లాడుతారు. కాని ఈ భాషకి 'సాహిత్యం' లేదు. ప్రస్తుతం, కొంకణి భాష పుట్టుపూర్వోత్తరాలని గురించీ, స్థానాన్ని గురించీ పెద్ద వాదవివాదాలు జరుగుతున్నాయి. ఈ సందర్భంలో సుప్రసిద్ధ పండితుడూ, గోవా దేశీయుడూ అయిన ప్రొఫెసర్ డి. డి. కోశాంబి 'మిథ్ ఎండ్ రియాలిటీ'లో అన్నమాటలు గుర్తుకి తెచ్చుకోవటం అవసరం అనుకుంటాను. కోశాంబి కేవలం పండితుడు మాత్రమే. ఆయనకి రాజకీయంగా ఏ పక్షపాతమూ లేదు.

"ఇంతవరకూ దొరికిన సాక్ష్యం, ప్రాచీనకాలంలో [illegible]

గంగానదీతీర సమతల ప్రదేశం నుంచి వలస వచ్చినట్లు సూచిస్తుంది...గోవా భాష, 'కొంకణి' మీద ఆధునిక కాలాలలో పోర్చుగీస్ ప్రభావం చాలా ఉండినది. ఎన్నో అరబ్బు, పారసీక పదాలు వాడుకలోకి వచ్చాయి. కాని కొంకణి కన్నడమూ కాదు, కొందరు అనుకున్నట్లు మరాటీకి చెందిన ఒక మాండలికమూ కాదు. నిజానికి కొంకణి మరాటీ వలెనే సంస్కృత, ప్రాకృత భాషలలో నుంచి నేరుగా పుట్టినది. అయితే, కొంకణి భాషలో బెంగాలీ సంభాషణలోని, బీహార్, తూర్పు ఉత్తర ప్రదేశ్ ప్రాంతాలలోని మాండలికాల వాడుకలని పోలిన అంశాలు ఎన్నో ఉన్నాయని స్వానుభావం మీద చెప్పగలను" అంటారు కోశాంబి.

కొంకణి భాషకున్న ఈ విశేష నిర్మాణమే దానిని కన్నడ, మహారాష్ట్ర భాషలలో కలిసిపోకుండా చేసి, దానికొక అందాన్నీ, విశిష్టతను ఇచ్చింది. 'సాహిత్యం' అంటూ ప్రత్యేకంగా లేకపోవటం వల్ల జానపద సాహిత్యం పెరిగి, గోవా ప్రజల శిక్షణ, వినోదాలకి తోడ్పడింది. భారతదేశంలోని తక్కిన భాషలకి వ్రాయబడిన సాహిత్యం ఎంతో ఉంది కాని గోవా ప్రజలకి జానపద సాహిత్యమే మిగిలింది.

గోవా జానపద సాహిత్యం స్వచ్ఛంగా ఉండటానికి మరొక కారణం ఉంది. ఒకదానిని పైన వర్ణించాను. ఈ రెండవ కారణం గోవా ప్రజల నిరాడంబర జీవితం, వారి సాంఘిక సంస్థల ప్రత్యేకత.

పోర్చుగీసువారి అత్యాచారాలని అందరూ ఖండిస్తారు. వాటిని ఖండించవలసినదే. విదేశీ పరిపాలన దుష్టమయినదో, కాని కొంతకాలం ఇక్కడ జరిగిన పరిపాలన అంత క్రూరంగా ఉండేదికాదు. 18 వ శతాబ్దం చివరి భాగంలో పోర్చుగల్ ప్రధాని 'మార్క్విస్ ఆఫ్ పొంబాల్' పోర్చుగీసు సామ్రాజ్యంలో న్యాయపరిపాలనకి కావలసిన విధానాలని కొన్నిటిని అనులుపరిచాడు. 1910 లో అధికారంలోకి వచ్చిన రిపబ్లికన్ ప్రభుత్వం కూడా సహృదయంతోనే ప్రవర్తించింది. 1928 లో డాక్టర్ సాలజార్ నియంత అయిన తర్వాతనే దేశపరిస్థితులు పూర్తిగా చెడిపోయాయి. పరిపాలన న్యాయంగా జరిగిన కాలం మాత్రం కొన్ని గోవా సాంస్కృతిక సాంప్రదాయాలకి మంచి దోహదం కలిగించింది.

'పొంబాల్ యుగం' లోని శాంతిభద్రతలూ ప్రజల సంతృప్తీ ఎటువంటివో శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ 1931 లో ప్రచురితమయిన ...కథలసంపుటికి పీఠికలో సూచించారు.

"గోవా ప్రజలు అమాయకులు, విశ్వాసం కలవారు, కల్లాకపటం ఎరుగని స్వచ్ఛమయినమనసులు కలవారు. ఒకరినొకరు గాఢంగా నమ్మేవారు. చిన్న పిల్లలవంటి మనస్తత్వాలు కలవారు. మొన్నమొన్నటి దాకా ఈ ప్రదేశంలో దొంగతనాలు ఎప్పుడోగాని జరిగేవికావు. మిగతా ప్రపంచం హత్యలు, మోసాలు దోపిడీలతో...గడగడలాడిపోతూ ఉంటే, గోవాలో జీవితం పురాతన మార్గంలో సాగిపోతూ ఉంటుంది. ఈ మార్గాన్ని నాగరిక జీవిత ప్రయోజనాలు భంగపరచలేదు."

ఎన్నో తరాలుగా భంగం లేకుండా సాగిపోయిన ఈ రకం గోవా ప్రజల జీవితం జానపద సాహిత్యం పుష్పించటానికి తోడ్పడింది.

విచిత్ర మేమిటంటే, గోవా స్త్రీలజీవితంలో విద్యాభ్యాసం వెనుకబడటం అక్కడి జానపద సాహిత్యం పెరగటానికి మరొక కారణం. స్త్రీ విద్యాభ్యాసం గోవా దేశంలో తక్కిన ప్రాంతాల కన్నా అర్థ శతాబ్దం వెనుకబడి ఉన్నది. ఇది అక్కడి హిందువుల విషయంలో మరింత నిజం. గోవాలో మొదటి బాలికల పాఠశాల 1930 దాకా స్థాపించలేదు. విద్యాభ్యాసంలేని ఆడవారంతా తమ పిల్లలకీ, పిల్లల పిల్లలకీ జానపద గాథలు చెప్పేవారు; ఇతర భారత స్త్రీలు చదువుకోవటం చేత పిల్లలకి ఈసప్, పంచతంత్రం, అరేబియన్ నైట్స్ కథలు చెప్పగలిగేవారు!

* * *

బొద్దుగా, ముద్దుగా ఉంటుంది నాలుగేళ్ళ ఆప్పూ. అన్నమింకా ఉడకలేదు. ఆప్పూకి ఆకలి. ఆప్పూకి అమ్మమీద కోపంవచ్చింది. బామ్మమీద అంతకన్నాను. బామ్మ మరి ఆప్పూ సొంతంగదా. మూతి మూరెడు చేసుకుని, కాళ్ళెత్తి దబ దబా అడుగులేస్తూ వంటింట్లోకి వెళ్ళింది. బామ్మ ఒళ్ళో గారంగా తలదూర్చి పడుకుని, "పొండి, నాకు అన్నం వద్దు, పాడూ వద్దు. ఇలాగే నిద్ర పోతానంతే...." అంది.

ఆప్పూబామ్మకి ప్రళయం వస్తోందని తెలుసు. ఇప్పుడింక మామూలు బుజ్జగింపులు పని చెయ్యవు. పిల్లల్ని గమ్మత్తు చెయ్యడానికి, బామ్మ దగ్గర ఎన్నో చిట్కాలున్నాయి. అందులోంచి మంచిదొకటి ఇవతలకి లాగింది బామ్మ. ఆప్పూకి జవాబు చెప్పకుండా తనలో తను పాడుకుంటున్నట్లు మొదలు పెట్టింది.

"ఆడవే చిలకా—ఆడవె నెమలీ
అయితే దుష్టుకి దూరం—
ఆడవె చిలకా—ఆడవె నెమలీ"

వెంటనే తపతప అడుగులు వినబడ్డాయి. భోజనాల గదిలో ఆడుకుంటున్న పిల్లలంతా బిలబిలలాడుతూ వచ్చారు. బామ్మ చుట్టూ మూగారు. "బామ్మా! బామ్మా! ఆపాటంతా

పోడు" అన్నారు.

"ఆ కథ మాకు చెప్పు" అంటూ వేధించారు.

ఆవూ కూడా చటుక్కున లేచి కూర్చుంది. అడిగిన వెంటనే బామ్మ కథ చెప్పదు. చెప్పను, చెప్పను అంటూనే పూరిస్తుంది. ఆఖరికి "అబ్బ చంపుతార్రా" అంటూ నవ్వి పాతకథే మళ్ళీ చెపుతుంది. పాత కథే పిల్లలంతా ఒళ్ళంతా చెవులు చేసుకుని వింటారు. బామ్మ మొదలు పెట్టింది.

"అనగనగా ఒక అడవి. ఆ అడవిలో ఒక పులి. పాపం అది వండు ముసలిదైపోయింది. లేళ్ళని వేటాడి తిందామంటే దానికి కాళ్ళలో సత్తువ లేదు. ఒకరోజుని దానికి ఎంతో ఆకలేసింది. నక్క ఒకటి ఆ దారిని పోతోంది. పులికి నోరూరింది. కాని నక్క జిత్తులమారి. పులి దగ్గిరికి రాదుగా. అంచేత పులి అంది.

"నక్కబావా! నా అదృష్టం ఏమనిచెప్పను. సమయానికి నువ్వు కనిపించావు. నేను కాశీ యాత్రకి బయలుదేరుతున్నాను. నాకు తోడుగా రావడానికి ఈ అడవిలో నువ్వు తప్ప ఇంకెవ్వరున్నారు? నా తోడా, మంచి ముహూర్తం దాటిపోనియ్యొద్దు" అంది.

"అమ్మమ్మ ఎంతమాట! ఈ అడవికి రాజుగారు తమరు. తమతో యాత్రకి పోవడమంటే పెట్టి పుట్టాలి. విఱంగా ఈ అదృష్టం నాది. కాని మహారాజా! ఇంతటి పుణ్యాన్ని నే నొక్కణ్ణే ఎల్లా మూటగట్టుకోను? ఇంకా కొందరు స్నేహితుల్ని పిలుచుకువస్తాను. మనకి తోడుగా ఉండటానికి" అంది నక్క. కొద్ది సేపట్లో ఒక చిలకనీ, ఒక నెమలినీ, ఒక తాబేలునీ ఒక కొండముచ్చునీ వెంటబెట్టుకొచ్చింది, అయితే తనుమాత్రం జాగ్రత్తగా అందరి వెనకా నడిచింది.

ఇంతమందిని చూడ్డంతోటే పులికడుపు నిండిపోయింది—అందరినీ ఎంతో సాగిడింది. ముహూర్తం మించిపోతుందేమోనని అంతా వెంటనే బయలుదేరారు తీర్థయాత్రకి. నాలుగడుగులు వేశారో లేదో ఆకొన్న పులి "అబ్బా, అందరం అలిసిపోయాం. ఆచెట్టు కింద కాస్సేపు కూర్చుని ఏవైనా తత్వాలు

# ఆడవే చిలకా - ఆడవే నెమలి



చెట్టు నీడలో విశ్రమించారు. నక్క మాత్రం పులికి కాస్త దూరంగా కూర్చుని పాట మొదలు పెట్టింది. చిలకా, నెమలీ నాట్యమాడాయి. తాబేలు తల ఊపింది. కొండ ముచ్చు చప్పట్లు చరుస్తూ తాళంవేసింది. అతి భక్తిగా నక్క ప్రారంభించిన తత్వం ఏమిటంటే—

ఆడవే చిలకా ఆడవే నెమలీ
అయితే దుష్టుకి దూరం
తోసుకువస్తే ఆపదలు
తుర్రుమంటారు వేగిరం
వంటికి లొంగని కోటయ్యా
తుంటరి కూర్మం నీ శరీరం
ఆఖరి కింక కొండ ముచ్చుగతి
అయ్యో! ఘోరం ఘోరం.

నక్క నోటివెంట ఈ మాట లొచ్చాయో లేదో, పులి కోతిమీదికి దూకింది. చిలకా నెమలీ తుర్రుమన్నాయి. తాబేలు తన కోట లోపల దాక్కుంది. ఇంక నక్కంటారా, అది ఎలా మాయమయిపోయిందో ఎవరికి తెలుసు? పులి తీర్థయాత్ర అంతటితో ముగిసింది. అది తన కాశీ చేరుకుంది.

ఈ కథ ఎన్నో చిలవలు, పలవలు పెట్టి ఎంతో అందంగా చెప్పింది బామ్మ. పిల్లలంతా మహా ముచ్చటపడిపోయి, నక్కపాడిన తత్వం పాడుకుంటూ మళ్ళీ ఆడుకోడానికి గొంతెత్తి ఉత్సాహంగా పాడుతుంటే బామ్మ సన్నగా నవ్వుకుంది. ఆవూ పాడింది.

"ఆడవే చిలకా—ఆడవే నెమలీ
అయితే దుష్టుకి దూరం" ●

---

మాంగో బాబా ఊళ్ళోకంతకీ పెద్ద కామందు. అతను ముందు అరుగుమీద హాయిగా హుక్కా పీలుస్తూ కూచున్నాడు. ఇంటిముందు పెద్ద ఆవరణ. దూరంగా ఆవరణకి ఆచివర, ఎవరో ఆడమనిషి పోతుంటే చూసి, "ఆఆకుపచ్చచీరకట్టుకుని పోతున్నది— మన ఆబోలీకాదూ? ఇల్లాపిలు," అన్నాడు ముఖంచిట్లించి గోంధల్యాతో, గోంధల్యా అతని నౌకరు. యజమాని హుక్కా ఆరిపోతే మళ్ళా అంటించడానికని కూచున్నాడు.

ఆబోలి అతనిపాలికాపుపెళ్ళాం. జడురుతూ, సంకోచిస్తూ, తలవంచుకొని నిలబడింది, ఏవోతిట్లు తప్పవనుకుంటూ.

"ఏమిటిది ఆబోలీ" అంటూ దుయ్యబట్టాడు మాంగోబాబా. "ఈపూటకూడా పనికి పోతున్నావా? నీమొగుడుజ్వరంతో మంచమెక్కితే? చిన్నాచితుకూ, నీపిల్లలేం చూడగలరు అతన్ని? ఆ షావుకారింట్లో ధాన్యం దంపిన ఆనాలుగు డబ్బులూ లేకపోతే నీకేంగడవదా?"

## వలలో చిక్కిన నెమిలిపుంజు



అంది; మాంగో బాబా భార్య సోనాబాయి, చేటు చ్చిన ఇంట్లోంచి గుమ్మంలోకొచ్చి. అసలు మాంగోబాబా కంటే ఈవిణ్ణి చూస్తేనే ఎక్కువ భయం పాలేళ్లకందరికీ. "నీకేమన్నా కష్టమొస్తే మేంఆదుకోమా? నీకేమన్నా కావలిస్తే ఆమాత్రం సహాయం చెయ్యమా? పెళ్లాం ఇల్లాగేనా మొగుణ్ణి చూసుకోడం?"

"అదే నేననేది. పెళ్లాంఇల్లాగేనామొగుణ్ణి చూసుకోడం?" అంటూభార్యని బలపరి చాడు మాంగోబాబా. అసలు అతను ఏం చెప్పినా యతికి ప్రతి అనేరకం సోనాబాయి. కొంచెంగయ్యాళి. ఈవేళ ఆమెతనమాటని బలపరచిందని మాంగోబాబాకి మహానంతో షంగా ఉంది. తన కోపం అంత తీవ్రమయి నదికాదని సూచించడానికి, విరగబడినవ్వాడు మాంగోబాబా. "నువ్వు చెడ్డ ఇల్లాలివని అనడంలేదు నేను, అబోలీబాయీ. మీ ఆడ వాళ్లు ఒక్కొక్కపుడుబొత్తిగామూర్ఖంగా ప్రవర్తిస్తారు. మీలో నూ తెలివైనవాళ్లు ఉన్నారనుకో — మీఅమ్మగారిలాంటివాళ్లు" అని కొంటెగా సోనాబాయివంకచూసి, మొదలుపెట్టాడు. "ఆపాతపాటలో నెమిలి పెట్టలాంటిదానివి నువ్వు.

"వలలో చిక్కిననెమిలిపుంచు గిలగిల లాడింది,

తెలివిమాలిన నెమిలిపెట్ట తెగ పాడే ఈపాట విని అంతానవ్వారు. అబోలి కూడా మొగం ముసుగులో దాచి నవ్వింది.

మాంగో బాబాకి హుక్కాతోబాటు కొన్ని ఖులాసా చేరిస్తే తృప్తిగా హాయిగా ఉం టుంది. ఆనాటి ఉదయం ఈపాట చక్కగా అందొచ్చింది. అయితే ఏకథనవ్వా ఊరికే సూచించి ఒదిలిపెట్టేరకం కాదు మాంగోబాబా. గొంధల్యాని దుయ్య బడుతూ అన్నాడు. "ఒరేచవటా!నువ్వె ప్పుడూ ఇంతేరా. మిగతావాళ్లునవ్వుతుంటే దాకలా నోరుతెరుచుకుని నువ్వూనవ్వ తావు. అసలీ నెమిలిపుంజూపెట్టా కథ నీజన్మలో ఎపుడన్నా విన్నావురా! అబ్బే నీమొహం నువ్వెక్కడవిన్నావు?"

మాంగోబాబా అనుగ్రహం సంపాదించా లంటే, అతనేకథ చెప్పినాసరే అది ఎరగ నట్టు నటించాలి అందరూ. అదొక శాసనం లాంటిది.

అంచేత గొంధల్యా ఈ కొత్తకథ విన డానికి అతికుతూహల పడుతున్నట్టుమొహం పెట్టాడు. నిజానికి వారంరోజులక్రితమే బజారులో కిరాణాదుకాణంలో తనయజ మాని చెపుతూండగానే విన్నాడీకథ.

పనిలోకని బయలుదేరిన అబోలీ అల్లాగే నిలబడి పోయింది. అసలు అతని కథల్ని గురించి ఎగతాళిచెయ్యగల మనిషి చిరునవ్వుతో కుతూహలంగా కనిపెడుతూ నిలబడింది.

"విసరా మట్టిబుర్రా! ఈనెమిలిపుంజు కథని మాబామ్మ చెప్పింది నాకారేళ్లప్పుడు. అంతే ఆరేళ్లు! అరవయిఏళ్లు నెత్తి మీదకొచ్చినా నీకీ కథ తెలియదు." అని ఉపోద్ఘాతం చెప్పి అమితఉత్సాహంతో అందరి వంకా చూశాడు మాంగోబాబా. కథ ప్రారంభించాడు.

"అనగనగా ఒకనెమిలిపుంజూ, పెట్టా ఒక సెలయేట్లో దప్పితీర్చుకుని, దగ్గరున్న మామిడితోపులోకి మెల్లగా నడిచాయి. నెమిలిపుంజు నాట్యం ప్రారంభించింది. నెమిలిపెట్ట హుషారుగా పాడ్డంమొద లెట్టింది. చాటుగా వలపరుస్తున్న వేట గాణ్ని పుంజూ, పెట్టా పట్టించుకోనేలేదు. వలని చూసి ఇదేదో మనుషుల ఆట వస్తువనుకుంది పుంజు. విరగబడినవ్వుతూ దానిమీద గెంతడం మొదలుపెట్టింది. దానికాళ్లు అందులో చిక్కుపడ్డాయి. విడి పించుకోడానికి గింజుకున్నకొద్దీ, వొళ్లంతా గాయమైపోయింది. బాధ ఎక్కువైంది. నెమిలిపెట్టమాత్రం తనపాటలో మునిగి పోయి, నెమిలిపుంజు అవస్థను గమ నించనేలేదు. అది ఇంకా జోరుగా పాడ్డం మొదలెట్టింది."

మాంగోబాబా మంచి ఉత్సాహంగా చెప్పా డీకథ. పకపకనవ్వుతూ, ఆపదం మళ్లా పాడాడు.

"వలలో చిక్కిన నెమిలిపుంజు గిలగి ల్లాడింది. తెలివి మాలిన నెమిలి పెట్టా తెగ పాడేస్తోంది."

అబోలి ముసుగులోపలే చిరు నవ్వు నవ్వుకుంటూ తన ఇంటి మొగం పట్టింది. తన మొగుడిమీద యజమాని చూపిన అక్కా రకు ఎంతో తృప్తి పడింది.

సోనాబాయి పక పక నవ్వుతూ వంట ఇంట్లోకి పోయింది.

గొంధల్యా తన యజమాని చమత్కారా నికి నవ్వు ఆపుకోలేకపోతున్నట్లు నటిస్తూ, హుక్కాలో నిప్పేసి, వూదడం మొదలు పెట్టాడు— ఆకథ అతని వూపిరితిత్తుల్లో

రాత్రులందు చదవండి

2 పుస్తకముల సెట్టు రు. 2-50

కొక్కోకశాస్త్రము 84 ఆసనములు (చిత్ర పటములతో) సుహాగ్ రాత్

ఒక్కొక్క పుస్తకం రు. 1—50

పోస్టేజి ప్యాకింగు అదనం.

**ARAHANT BOOK DEPOT.,**
26, ALIGARH (U .P.)

---

శాన్ బ్రాండ్

ఫ్రూటోల్

FRUITOL

తరసంగులుగా ప్రసిద్ధి చెందిన పానీయం

---

నిరాశ చెందవద్దు

దాంపత్య జీవితంలోని బలహీనతగూర్చి మీరు చింతపడవద్దు

## జీవన స్పెషల్

రుచియైన ఆయుర్వేదటానిక్. ఉత్తమగుణములుగలది. కోల్పోయినశక్తి నిచ్చేకాక మీ దాంపత్య జీవితాన్ని ఆనందమయం చేస్తుంది. స్త్రీలు ప్రసవానంతరం "జీవన స్పెషల్" సేవించిన, యౌవనులుగా నుందురు.

ఎక్కువ ఫలితానికి:—

పాలువాడటం మంచిది — కావలసినంత దేహ వ్యాయామము చేయవలెను — గ్రుడ్లు వాడరాదు.

**ముఖ్య గమనిక :** జీవన స్పెషల్ మీ దేహాన్ని తొందరగా పోషించు శక్తిగలది కాబట్టి మూడు వారములు సేవించిన తర్వాత ఒక వారంరోజులు మానివేయుటం చాల అవసరం. లేనియెడల లావై పోదురు. లేక దాంపత్యవాంఛ అధికమగును. ఆరోగ్యం, బలం చేకూరినవెంటనే మానివేయవలెను. 450 గ్రాముల ప్యాకింగ్‌లో లభించును. ధర రు. 10/-

## అమృత లేపనం (పురుషులకు మాత్రము)

దాంపత్య జీవితములో తీవ్రమైన లేక జీర్ణించిన అన్ని రకాల బలహీనతలకు శక్తివంతమైన ఔషధము. (పై పూతకు మాత్రము) 25 M.L.L. సీసా 1 కి ధర రు. 10/- నికరం.

ఉచిత కరపత్రములకు వ్రాయండి: ఉత్తరములు ఇంగ్లీషులో వ్రాయవలెను. అన్ని ఆర్డర్లతోపాటు ఔషధము ధరలో సగం పంపవలెను. మిగతమొత్తమునకు వి. పి. పి. పంపబడును ప్యాకింగు మరియు ఫార్వార్డింగ్ ఛార్జీలు అదనం.

*Orders to:*

**Jeevamritham Oushadha Sala,**
CALICUT 1.(S.India)
Chief Physician: **Dr. K. N. RAMDAS** Phone: 2419 & 3607

గమనిక : ఆంధ్ర, మధ్యప్రదేశ్ మరియు ఒరిస్సాలలోని అన్ని ముఖ్య పట్టణములకు స్టాకిస్టులు కావలెను. షరతులకు, నిబంధనలకు వ్రాయండి.

---

త్వరలో అజీర్ణము, కడుపుమంటలను

# పోగొట్టును

ఫిలిప్స్ మిల్క్ ఆఫ్ మెగ్నీషియా టేబ్లెట్లు

మధురమైన ప్రతి ఫిలిప్స్ బిళ్ల తన తూకమునకు 180 రెట్లు అదుపుగల కడుపు మంటను కలిగించు ఆమ్లమును హరించు శక్తి కలిగియుండుటచేత ఇతర మందులకన్న శ్రేష్ఠమైనది.

పిల్లలు దీని రుచిని ఇష్టపడెదరు — వారు ఈ బిళ్లలను పిప్పరమెంట్లవలె సునాయాసముగ సేవింతురు. సౌలభ్యముగా మీకు ఇవి 75 మరియు 150 బిళ్లలుగల సీసాలలో దొరుకుతున్నాయి. కుటుంబమంతటికి సరిపోవును. ప్రతి ఇంట ఉండవలసినది. నేడే చూడండి! అన్ని మందుల కొట్లలోను దొరకును.

4 బిళ్లలు 20 పైసలు!

TABLET PHILLIPS TRADE MARK MILK OF MAGNESIA TABLET

# ఫిలిప్స్

మిల్క్ ఆఫ్ మెగ్నీషియా టాబ్లెట్

మాన్యుఫాక్చరర్ : రిజిస్టర్డ్ యూజర్ బేన్ మెడికల్ స్టోర్సు (మాన్యుఫాక్చరింగ్) ప్రైవేట్ లిమిటెడ్. 62 బెంటింక్ రోడ్డు, కలకత్తా-13

PXDW.T08

ాని రకం జేరారు. ఒక్క్షళ్ళ్లా అద్దె సరిగా
స్తున్న పాపాన పోవడంలేదు'' తల పట్టు
ింది మామ్మగారు.

సత్యానికి అప్పుడే మెలుకువొచ్చింది. ఎసగ్గా మామ్మగారుకనబడింది. కళ్ళు ంలువుకొని చూసాడు. సత్యం—మామ్మ ార్నే! అదేసమయంలో మామ్మగారుకూడా హాసింది సత్యాన్ని.

"ఏం నాయనా? నీకెక్కడా ఉద్యోగం ొరకలా?........ ఇలా ఎంతకాలం బలా ూరుగా తిరుగుతావ్?..... చూడు నీకోసం ఃపిల్లఎంత కష్టపడుతోందో?.. పెళ్లి

# శకునం

పెడాకులు లేకుండా ఉంది. ఉద్యోగం నీకింత వరకు దొరకలా?..... అవ్వ నీలిన్నాయం పాడుగానూ..... అంతానటన.... చేతగా బోతేసరి.ఉద్యోగం దొరకలేదనడానికి''మామ్మ గారు కోపాన్నంతాంసత్యంమీద వెళ్ళగక్కింది.

సత్యం అలా నోరు తెరచుకొని వుండి పోయాడు. సుశీలకు ఎక్కడ్లేని కోపం వచ్చింది మామ్మగారిమీద. కానీ ఏం చెయ్యలేక, వూరుకుంది.

సత్యం మొహం కప్పుకొని ఏడ్చాడు.

ప్రేమాయణం (మూడు ముక్కల్లో) బాపు


కట్టె


కొట్టె


ఎతెచ్చె

సుశీల సత్యం దగ్గరికివచ్చి తలనిమిరింది. "ఛ!..... వూరుక్కోరా..... ఆవిడమాటలకే బాధపడ్తారా? ... ఆవిడ స్వభావం తెల్సు గదా?......'' ఓదార్చింది సుశీల.

"రోజు ఉద్యోగంకోసం తిరుగుతూనే వున్నా కానీ ఉద్యోగం దొరసకడం లేదు. అదినాకర్మ! నేనేంజెయ్యనక్కా?'' ఏడ్చాడు సత్యం.

సుశీల కళ్లనీళ్లు తుడుచుకుంది.

సత్యం మంచంమీంచి లేచాడు.వంతొమ్మి దేళ్ల సత్యం సిగ్గుపడ్డాడు ఏడ్చినందుకు. వెళ్లిమొహం కడుక్కున్నాడు.

ఇంతలో సత్యం స్నేహితుడు భగవాన్ పరుగెట్టుకొచ్చాడు. "రేయ్! తొరగా బయు ల్దేరు. నీకు ఉద్యోగం ఇప్పిస్తారుమానాన్న'' అన్నాడు ఆయాసంగా.

"నిజంగానా?''కళ్లు ఆనందంగా మెరి శాయిసత్యానికి.

"నిజమే,నీఎప్ప్లాయిమెంట్ రిజిస్ట్రర్ అదీ ఫ్ర టాకీ అప్లికేషన్ఒకటిరాయి. త్వరగా'' తొందర పెట్టాడు భగవాన్.

"అక్కా: ఓ అర్ధణా ఉంటే ఇవ్వు. తిల్లా కాయితంకొనాలి.'' సత్యం అడిగాడుసుశీలని.

సుశీల అర్ధణాఇచ్చింది. సత్యంఅర్ధణా ఎప్ప్లాయిరిజిష్టరూ తీసుకొని బయలు దేరాడు భగవాన్‌తో.

సుశీల వెళుతున్న సత్యంవంక చూస్తూ, నిలబడి పోయింది.

మధ్యాహ్నం ఒంటి గంటయింది

సత్యం గబగబా ఇంట్లోకివచ్చాడు. సుశీల గొను కుట్టడం ఆపి సత్యంవంక చూసింది. "నాకు ఉద్యోగం దొరికిందక్కా!''సంతోషంగా షంగా అన్నాడు. తొడుక్కున్న చొక్కా విప్పేసి కాళ్లుచేతులు కడుక్కున్నాడు.

సుశీల భోజనం వడ్డించింది.

సంతోషం సత్యం మొహంనిండా సెమ టగా పట్టింది. వచ్చి పళ్లెంముందు కూర్చు న్నాడు సత్యం.

"జీతమెంత?'' సుశీల అడిగింది.

"ఇంకా చెప్పలేదక్కా! సాయంత్రం చెపుతారేమో. ప్రొద్దున్న భగవాన్‌నాన్న గారు తీసుకెళ్లి చేర్పించారు. మా మేనేజర్ చాలా మంచివాడక్కా. నేను ఈ పూట చేసినపనిచూసి మెచ్చుకున్నాడు. నాకు

లెక్కల్లో కొంచెం ఓపాటిమార్కులు రావడం చూసి ఆశ్చర్యపోయాడు......" సత్యం చెప్పుకుపోతున్నాడు. సుశీల వింటూ కూర్చుండి పోయింది.

"అసలు నాకుద్యోగం ఎందుకు దొరికిందో తెల్సా అక్కా? ఇవాళ ప్రొద్దున్న మామ్మగారి మొహం చూసాను. అందుకే దొరికింది." సత్యం అన్నమాటలు విని సుశీల ఆశ్చర్య పోయింది.

సత్యం భోజనం ముగించాడు.

"ఇహ నేవెళ్తానక్కా..... సాయంత్రం ఆరింటికల్లా వచ్చేస్తాను. సాయంత్రం జీతం సంగతి చెప్తారుకదక్కా... యాభై ఇచ్చినా చాలు ఏం అక్కా?" అడిగాడుసత్యం.

సుశీల మాట్లాడలేదు.

సత్యం ఐదున్నరకి మానేజర్ గదిలోకి వెళ్ళాడు—ఆయన పిలవగా. మానేజర్ సత్యానికి ఓ లెటరిచ్చాడు. సత్యం దాన్ని విప్పదీసి చదివాడు. అది ఎప్పాయింట్మెంటు ఆర్డర్! జీతం వంద!! సంతోషంతో నోటమాటరాలేదు సత్యానికి.

"థాంక్స్..... థాంక్యూసర్!" వణుకుతూ అన్నాడు సత్యం. ఆసంతోషాన్ని చూసి మానేజర్ నవ్వుకున్నాడు.

సత్యం కాసేపటికి ఆఫీసులోంచి బయట పడ్డాడు. గట్టిగా గాలిపీల్చాడు. తనూ తనూ ఒక ఉద్యోగం సంపాయించగల్గాడు. ఇక హాయిగా ఉండొచ్చు.

సత్యం సంతోషంగా ప్లాట్‌ఫారం మీద నడుస్తూ హఠాత్తుగా ఒకచోట ఆగాడు. అవతలవైపున మామ్మగారు దుకాణంతో ఏవో పళ్ళు కొంటూ కనిపించింది. సత్యం మనస్సు ఒక్కసారిగా కృతజ్ఞతతో నిండి పోయింది. నాకు ఉద్యోగం దొరికింది మామ్మగారూ!........ మీదయవల్లే అని చెప్పాలనిపించింది.

మామ్మగారు పళ్ళుకొని అప్పుడేరిక్షా ఎక్కింది. సత్యం తొందరగా రోడ్డుకడ్డంగా పరుగెట్టాడు ఆమెను కలుసుకోవాలని.

మరుక్షణం రోడ్డుమీద జనం "అమ్మో!!" అని ఒక్కసారిగా అరిచారు.

లారీ ఒక్క కుదుపుతో ఆగింది—సత్యాన్ని తిన్న తర్వాత. ●












వైజ్ఞానిక గాథావళి-5



# అశ్వపరిణామ గాథ

-జార్జి సి మాంక్స్-

-శౌరి..

గుర్రముచాలా ఉపయోగకరమైన జంతువు. ఈ నాటి సైకిల్ రిక్షాలతో గుర్రపు బండ్లకు దెబ్బ. గుర్రాల్ని కొనడమూ, పెంచడమూ తగ్గిపోతుంది, క్రమంగా గుర్రము ప్రాణికోటిలోంచి అదృశ్యమై పోతుంది. గుర్రాన్ని ఉపయోగించడము తగ్గినదన్న కారణాన్నిబట్టి కాదు గుర్రము తగ్గిపోయి హరించి పోతుందనడము. గుర్రము కాలికి చూడండి ఒకటేగిట్ట. ఒంటెకాలు రెండుగా చీలి వుంటుంది. ఆవుకి గిట్టలు రెండూనూ, గిట్టలకు పైన కొంచెముపైన రెండు చిన్న గిట్టలు — హరించి పోతూన్నవి—న్నూ ఉన్నాయి. ప్రాణికోటి తరతరాల జీవితంలో వాటి సుఖజీవనానికి అవసరమైనట్టుగా అంగములు పుట్టి వృద్ధికావడమూ, అక్కర లేని అంగములు పొట్టి సన్నమూ అయి పోయి హరించిపోవడమూ జరుగుతుందని ప్రాణి పరిణామవాదము చెపుతుంది. జిరాఫీ మెడ క్రమంగా పొడుగైందనీ, కోతికి బుగ్గసంచులు ఏర్పడ్డాయనీ. శాకాహార చతుష్పాత్తుల రక్షణావసరము కోసము వాటి ఆహారకోశములోని మొదటిత్తిత్తి గడ్డిని పడేసుకొని వుంచి, తీరిక సమయంలో నెమరుకి అందిస్తుందనీ, చెప్తారు జంతు శాస్త్రజ్ఞులు. చేపలకి కాళ్ళూ, పెంగ్విను పిట్టలకు ఈకల రెక్కలూ ఉండేవనీ, అవసరముతగ్గి పోవడముతో అవి హరించి మిగిలి, ఈదడానికి పోయపడుతున్నాయనీ చెప్తారు.

ఈపరిణామ వాదములో ఇంకా సొగసు లున్నాయి. పెద్దమృగాలు తరతరాల జీవన వికాశము ద్వారా చిన్నవి కావడము ఎంత నిజమో, చిన్న మృగాలు క్రమంగా ఒళ్ళు పెంచుకుని పెద్దవికావడమూ అంతే నిజము. గుర్రము ఒక ఉదాహరణము.

గుర్రాలు అరేబియా పర్షియాదేశా లలో ఎక్కువ. జాతి గుర్రాలు ఆదేశాలను నుంచే ఇతర దేశాలకి తీసుకు వెళ్తారు. కనుక, గుర్రమన్న జంతువు ఆ ప్రాంతం లోనే ఉద్భవించి ఈనాటి గుర్రముగా పరిణమించి వుంటుందని సామాన్యజనమే కాదు, శాస్త్రజ్ఞులుకూడా విశ్వసించ డము విపరీతమేమీ కాదు.

అమెరికా ఖండములో గుర్రాలు ఉండేవి కావనీ, కొలంబసు అమెరికాదీవుల్ని కను కున్న తర్వాత ఆఖండంలో స్థిరనివా సానికి తొలిసారిగా వెళ్లిపోయిన స్పెయిను దేశీయులు— స్పెనియార్డులు—గుర్రాన్ని, ఆఖండంలో మొదటి సారి ప్రవేశపెట్టా రనీ అన్న నమ్మకము ఇలాటిదే. అయితే ఆదేశపు భూగర్భశాస్త్రజ్ఞులు జోసెఫు లీడీ, ఛార్లెసు మార్ష్‌ల నిరంతర కృషి ఫలితంగా సముద్రాలకు అవతల ఉన్న ఆఖండంలో కూడా గుర్రమునకు మూల మైన జంతువు ఆవిర్భవించి పరిణామము

చచ్చిపోయి పూడిపోయిన శరీరాలు మెత్తి, అయిపోయి రూపు మాసి పోతాయని మనకు తెలుసును. తడిమట్టిలో పూడి పోయినవీ మడ్డలో పూడిపోయినవీ విచిత్ర మైన పరిణామానికి లోనౌతాయని భూగర్భ శాస్త్రజ్ఞులు కనుకున్నారు. ఆ జంతు వుల అస్థిపంజరాలలోని అస్థికణాలు నీటిలో ఏ కొంచెమో కరిగి వున్న ఖనిజ వస్తువుకీ శుద్ధవస్తువుకీ స్వాగతము చెప్పి తమస్థానంలో వాటిని ఉంచి, తాము నీటిలోకి కరిగి పోతాయి. ఇలాగ జరిగి కాలక్రమాన్ని అస్థిపంజరము రాతి పంజరంగానో సున్నపు పంజరంగానో రూపొందుతుంది. భూమిని తవ్వినప్పుడు ఆయా పొరలలో ఆయాకాలాల జంతు వుల అస్థిపంజరాలు శిలావశేషాలుగా లభి స్తాయి. వీటిని బట్టి ఆజంతువుల అప్పటి రూపాలూ, సైజులూ, అలవాట్లూ తెలుసు కుంటారు శాస్త్రజ్ఞులు. పొల గ్రామాలు విరభూతి పొలవు పత్తులూ శంఖాలూ నట.

జోసెఫు లీడీ పురాయుగాల గుర్రపు ఎముకల్ని పట్టి, గుర్రము అమెరికాలో ఉండి ఉండునన్న అనుమానము కలిగిం చాడు. 1874 నాటికి మార్ష్ ముప్పయి రకాల గుర్రాల శిలావశేషాలు సంపాదిం చాడు. రకాలంటే పరిణామక్రమమును — ఏకొంచెమైతేనేమి - సూచించేవి అన్న మాట. 1868లో నెబ్రాస్కాలో పురాతనపు చెరువులోని పాత మట్టి తిరగవేసి నప్పుడు అతనికి ప్రొటో హిప్పస్ అన్న జంతువు ఎముకలు దొరికేయి. అవి గజము ఎత్తైనా సరిగ్గాలేని గుర్రానివి. కాళ్ళు చాలా పల్చనా, గిట్టలు మూడుకీ ఎత్తూ కాళ్ళూ భేదము మన కాలపుగుర్ర ముతో. ఇంతకంటే పురాతనపుదీ, నక్క అంత సైజుదీ ఓరోహిప్పస్ అన్నది, నాలుగు వేళ్ల ముందు కాళ్ళతో అతనికి 1872 లో దొరికింది. రెండేళ్లకు తరువాత మూడే గిట్టలు (వేళ్లన్న మాట) తో ఉన్నా గొర్రె అంత సైజుది మయో హిప్పస్ ('మ యో' సీ ను యుగమునాటి గుర్రము అని అర్థము) దొరికింది

నాటి ప్లియోహిప్పస్ దొరికింది. ఈక్వస్ అన్న ఒక్క గిట్ట గల గుర్రము తర్వాతి యుగములో ఏర్పడ్డ పొరలో దొరికింది.

మార్ష్ పెట్టుదలా ఓపికా వ్యయమూ అన్న త్రిశూలధారకు పురాయుగాల పతులే కాక అశ్వపరిణామాన్ని చక్కగా చూపించే శిలావశేషాలు దొరికేయి. నక్క అంతటి నాలుగువేళ్ల జంతువు, గొర్రె అంతటి మూడువేళ్ల (గిట్టలన్నా అనవచ్చును) జంతువై, క్రమంగా గజము ఎత్తు అయి, పల్చని కాళ్లతో నిలిచింది. ఇది ఈనాటి గుర్రముగా పరిణమించింది. గుర్రము అమెరికాలో కూడా ఉండేది ఒకటే. చిన్న సైజు, నాలుగువేళ్లనుంచి పెద్ద సైజు ఒకే గట్టి గిట్టా గల జంతువుగా పరిణమించింది రెండూ. గుర్రము కాలిగిట్ట ఇంక పరిణామక్రమంలో పరిశము కాలేదు. ●

---








సాయంకాలం రచ్చబండ దగ్గర పది మంది చేరి వేటకుక్కలను గురించి మాట్లాడుకుంటున్నారు. వాటిలో రకాలు, అందచందాలు, ఎన్నిక చేసే విధానము, వాటి తెలివితేటలు వగైరా విషయాలెన్నో మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మధ్య ఒక భాగ్యవంతుడు —వట్టి పిసినారి— కూడా ఉన్నాడు. అతడు తనకు వేటకుక్కలంటే చాలా ఇష్టం అన్నాడు.

"వేటకుక్కని ఒకదాన్ని పెంచాలని ఎప్పటినుంచో కోరిక. కాని, ఎంత ప్రయత్నించినా దొరకలేదు."

ఆ మాట మనస్ఫూర్తిగా అన్నది కాదని మౌల్వీ నసీరుద్దీన్ గ్రహించాడు.

"మీకు అంత మనసుగా ఉంటే రేపే ఒక వేటకుక్కని మీ ఇంటికి తీసుకువస్తాను."

భాగ్యవంతుడు చాలా సంబరపడ్డాడు.

"కాని, ఖరీదు కాస్త ఎక్కువే అవుతుంది" అన్నాడు మౌల్వీ అతడిని తప్పించడానికి.

"ఆ, దానికేం ఉంది? తీసుకురండి. డబ్బును మనం సంపాదిస్తాం గాని, మనల్ని డబ్బు సంపాదించదుగా." అనేశాడు ధైర్యంగా ఆ భాగ్యవంతుడు.

మరునాడు పొద్దుటే దారిలో కనిపించిన తుండులా బలిసిన ఊరకుక్కను పట్టుకుని, భాగ్యవంతుడి ఇంటికి తీసుకువచ్చాడు మౌల్వీ.

ఆ కుక్కను చూచి భాగ్యవంతుడు పకపకా నవ్వేడు.

"ఇదెక్కడి వేటకుక్క!...."

"ఇది అసలైన జాతి జాగిలం..." అన్నాడు మౌల్వీ.

"అబ్బే! వేటకుక్కలకి కాళ్ళు సన్నంగా ఉంటాయి. పొట్ట వడ్డికి అంటుకుని ఉంటుంది..." అని భాగ్యవంతుడు తనకు తెలిసిన వేటకుక్కల లక్షణాలన్నీ ఏకరువు పెట్టేడు.

అర్థోక్తిలోనే మౌల్వీ ఇలా అన్నాడు "అదెంత భాగ్యం! మీ దగ్గరనెల్లాళ్ళు ఉందంటే ఈ కుక్కకి మీరు వర్ణించిన లక్షణాలన్నీ వస్తాయి!" ●




ఒకనాడు మౌల్వీ నసీరుద్దీన్ ఇంటికి ఒక అతిథి వచ్చాడు. చమత్కారంగా మాట్లాడే అలవాటుంది అతడికి.

మౌల్వీ పెద్ద గ్లాసుతో టీ తెచ్చి ఆయన ఎదుట పెట్టేడు తాగమని.

"హా తీసుకోండి"

అతిథి ఆగ్లాసుకేసి చూసి కంగారు పడ్డట్లు నటించాడు.

"మౌల్వీసాబ్! మీ ఇంట్లో గట్టి తాడు ఒకటి ఉంటే తీసుకురండి"

"తాడా? ఎందుకూ?"

"నా నడ్డికి కట్టుకుని, ఈ స్తంభానికి ముడివేసుకోడానికి"

"ఎందుకూ?"

"ఈ గ్లాసులో పడి మునిగిపోతానేమో అని భయంగా ఉంది"

తనను వేళాకోళం చేస్తున్న ఆ ఆసామీకి ఏం సమాధానం చెప్పాలో మౌల్వీకి తోచలేదు. పైకి మాత్రం అతనితో పాటు పకపకా నవ్వేశాడు.

మరికొన్నాళ్ళు పోయాక ఆ వ్యక్తి ఇంటికి ఏదో పనిమీద వెళ్ళవలసి వచ్చింది మౌల్వీకి. ఆయన మౌల్వీని సాదరంగా లోపలికి తీసుకు వెళ్ళి, లక్క పిడత అంత చిన్నారి గ్లాసుతో టీ ఇచ్చాడు. అంతటితో ఆగక "ఇదిగో ఇటువంటి గ్లాసులతో అతిథులకి చా ఇవ్వాలి" అని మౌల్వీ ముఖంలోకి పరిశీలనగా చూచాడు.

మౌల్వీ కంగారుపడ్డాడు.

"అయ్యా! మీ ఇంట్లో తాడొకటి ఉంటే తీసుకువస్తారా?"

గృహస్థు పకపకా నవ్వేడు.

"ఈ గ్లాసులోపడి మునిగిపోయే భయంలేదు లేవయ్యా! తాగుతాగు!"

"అబ్బే! నా భయం అదికాదు. తాడు ఈ గ్లాసుకి కట్టి ఉంచుకుంటే తాగేటప్పుడు నోట్లో దూరిపోయే ప్రమాదం లేకుండా నిర్భయంగా తాగవచ్చు." ●





బలము మరియు శక్తికోసం!
Cadbury
Bournvita
THE IDEAL FOOD DRINK FOR STRENGTH AND VIGOUR
బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది.
కండరములు మరియు టిస్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు,
బలము మరియు శక్తి కోసం కార్బొహైడ్రేట్‌లు, ఎముకలు
దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు
అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా
తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును!




కోకో
పంచదార
మాల్ట్
పాలు
క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా
BENSONS/I-CF.23

తలను నిండియుంది. బ్రహ్మన్న, నాగమ్మ నిరుత్తరులుగా వింటారు. బ్రహ్మన్నకు ఆ సేనానాయకుని చూడగా హృదయం దయార్ద్రమైంది. "ఇంతటి అమాయకుల గొంతుకలు కోయుటయా!" అని వాపోయాడు తనలో !

నాగమ్మను చూచి "నాగమ్మగారూ ఇందరు అమాయకుల్ని మన కక్షలకు బలిపెట్టడం కంటె మీలో ఒక వీరుణ్ణి మాలో ఒక వీరుణ్ణి విడిచి పెడదాం ! వారిలో ఎవరు గెలిస్తే వారిదే విజయము" అన్నాడు.

ఆమాట విని నాగమ్మ,

"బ్రహ్మన్నగారూ యుద్ధం చేయలేకపోతే ఆ మాట చెప్పి నిజంగా ఓటమి నంగీకరించండి" అని హేళన చేసింది. యుద్ధం ప్రారంభమైంది!

ఒకచోట బాలచంద్రుడు నరసింహరాజు ఎదురు పడ్డారు. అతన్ని చూడగానే బాలుడు కాలుదువ్వి నాడు. బాలచంద్రుడు విసిరిన కత్తివేటు తప్పించుకుని ఈటెతో బాలచంద్రుని డొక్కలో పొడిచాడు నరసింహరాజు. అంతేకాదు వెంటనే తల ఖండించబోయాడు! బాలుడు దానిని తప్పించుకుని నరసింహరాజు తల ఖండించి, ఒకచేత్తో డొక్కలో గాయాన్ని అదిమిపట్టుకుని మరోచేత్తో నరసింహుని తలను పట్టుకుని శిబిరంవైపు అశ్వాన్ని పరిగెత్తించాడు.

శిబిరానికి వెళ్ళి నరసింహరాజు తల కొమ్మరాజు పాదాల చెంత పడేట్టు విసిరాడు. మరణశయ్యపైనున్న కొమ్మరాజు "భళే, మాట నెరవేర్చావురా నాయనా" అంటూ తృప్తిగా కన్ను మూశాడు !

"దుర్మార్గుడా ! ఎంతపని చేశావ్, వాళ్ళ ఉప్పూ పులుసూ తిని బ్రతికి, వాళ్ళకే ద్రోహం చేస్తావా ?" అని బాలచంద్రుణ్ణి చీదరించుకున్నాడు బ్రహ్మన్న ! తండ్రి మాటాడిన పరుష వాక్యాలకు కినిసి డొక్కలో గాయంతో తిరిగి యుద్ధరంగానికి వెళ్ళిపోయాడు బాలచంద్రుడు. అతడు నిష్క్రమించాక బ్రహ్మన్న వేషంలో యున్న మాంచాల శిబిరం ప్రవేశించి "ఒక మహా వీరుణ్ణి, దేశభక్తుణ్ణి అవమానిస్తారా బ్రహ్మన్నగారూ ? మీ ఆశయ రక్షణకోసం మీ మహాజీవన సిద్ధాంత స్థాపనకోసం కత్తిబట్టి నేడిరక్తం ధారపోస్తున్న ఒక మహాపురుషుణ్ణి అనవలసిన మాట కాదు." అని మందలించింది. ఆమె తన కోడలని తెలుసుకుని బ్రహ్మన్న ఆశ్చర్యపోయాడు. మలిదేవరాజు చకితుడైపోయాడు. బ్రహ్మన్న తన కొడుకూ, కోడలూ ఆదర్శప్రాయులే యని సంతృప్తిగా నిట్టూర్చాడు.

మాంచాల బాలచంద్రుడికి కానవచ్చింది. ఆమె సాక్షాత్కారం అతనికి విస్మయం కలిగించింది. బ్రతికినా, మరణించినా మీతోటే జీవితం అని చెప్పి ఆమె అతడితో యుద్ధరంగానికి బయలుదేరింది. బాలచంద్రుడు ప్రళయకాల రుద్రుడులా విజృంభించాడు. నాగమ్మ అతన్ని అడ్డుకున్నది. ఆమెతో అతడు పోరుసలిపి నిరాకరించాడు. మాంచాల ఆమె నెదిరించింది. తప్పులు కన్నమదాసు, మాంచాల, కన్నమనాయుడు బాలచంద్రుడు చూపిన ధైర్య పరాక్రమాలకు చెల్లాచెద రయ్యారు. ప్రేగులు బయటపడినా డొక్కలో కట్టుతో పోరాడుతూనే పోరాడి [illegible]

[illegible] గాయపడి నేల కూలింది. శక్తినంతా పుంజుకుని లేచుకుంటూ ఆమె ఖడ్గ ప్రయోగం చేసి ప్రాణాలు విడిచింది.

బ్రహ్మన్నకు ఈ వార్త కలవరింత కలిగించింది. ఎంతమందిని ఇలా యుద్ధం పొట్టన బెట్టుకుంటుందో అన్నదే అతని బాధ. మలిదేవ మహారాజు, బ్రహ్మన్న స్వయంగా యుద్ధములో పాల్గొనవలసిన పరిస్థితి ఏర్పడింది.

బ్రహ్మన్నమీదకు [illegible] యుద్ధ వీరులను పోరుకు పంపింది నాగమ్మ. ఖడ్గకోట భీమసేనుడు, పటాల బ్రహ్మన్న మొదలైన వీరులంతా బ్రహ్మనాయుని క్రోధాగ్నికి [illegible] పురుగుల్లా ఆహుతయ్యారు.

వీరభద్రుడు బ్రహ్మన్న మీదకు వెళ్ళాడు. అతణ్ణి రాగోలకు చుట్టి ఆకాశాని కెగురవేశాడు బ్రహ్మన్న. [illegible] కానరాకుండా మాయమయ్యాడు. నిర్విరామంగా పోరాడుతున్న వంగారురాజు వెంటబడ్డాడు బ్రహ్మన్న. అతన్ని కాపాడటానికి కొందరు బ్రాహ్మణులను పంపి బ్రహ్మన్నను ఎదురు పంపింది నాగమ్మ. వారు బ్రహ్మన్నను క్షమాభిక్ష వేడుకుంటూ మహారాజుకు ప్రాణభిక్ష పెట్టమన్నారు.

"అనుగురాజా వంశానికే నిప్పు ఒక్కడినే నేను. పెంచిన చేతులతోనే అందర్నీ తుంచుకున్నాను !" అంటూ రంకెలువేశాడు బ్రహ్మన్న !

"క్షమాభిక్ష ప్రసాదించండి బ్రహ్మన్నగారూ", అని అర్థించింది నాగమ్మ.

బ్రహ్మన్న హృదయం కరుణార్ద్రమైంది.

"నాగమ్మా నువ్వుని పలనాటిలో చిచ్చుపెట్టావు అన్నదమ్ముల మధ్య వైరం కల్పించి అనుగురాజు వంశాన్ని త్రుంచివేసావు. ఒక్క బ్రహ్మన్న

నరసింహరాజు తలతో బాలచంద్రుడు.

మీదున్న కోపంతో యిందరి అమాయకుల రక్తం ఏరులు కట్టించావు ! ఏం బావుకుందామని చెప్పు?" అన్నాడు బ్రహ్మన్న.

నాగమ్మ కన్నీరు పెట్టుకుని పశ్చాత్తాపపడుతూ, "బ్రహ్మన్నగారు! మీరు శైవమతాన్ని అవమా నించినందుకు యింత రక్తపాతానికి పూను కున్నాను ! ఇంత వినాశనం జరుగుతుందని నే నూహిం చలేదు! విజయాన్ని మాత్రమే కాంక్షించాను! చివరకు నేను పరాజితురాల నయ్యాను" అని వాపోయింది.

# సినిమా కథ

"శైవం, వైష్ణవం అంతా ఒక్కటే ! భగ వంతు డొక్కడే! అయినా వివిధ నామాలతో పూజిస్తున్నాం. అంతే తేడా ! మతాలు వేరైనా ధ్యేయం ఒక్కటే. దానికోసం యింత చేటు తెచ్చుకోవడం మానవత్వంకాదు. మత మౌఢ్యం పనికిరాదు. ఇకనైనా బుద్ధికల్గి ఏ చేతులతో పల నాటిని నాశనం చేసావో ఆ చేతులతోనే దానిని పునరుద్ధరించు ! నేను గుత్తికొండ బిలానికి వెళ్లి తపోధ్యానంతో కాలం గడుపుతాను. నలగామరాజా నీవిప్పుడు మహామంత్రిపై కన్నమదాసుని సైన్యాధ్యక్షుడిగా నియమించి సర్వ మతాలను, సర్వ జాతులను సమదృష్టితో చూస్తూ పాలించవల సింది" అని చెప్పి అందరివద్దా సెలవు పుచ్చుకుని వెళ్లిపోయాడు బ్రహ్మన్న. సర్వ వినాశనం తరు వాత పలనాటి కథ, చరిత్రలో రక్తాక్షరాలుగా నిలిచిపోయింది.

సమాప్తం

కొన్నుకుని తల వాల్చుకుంది.

తుడుచుకుందామనుకుంటుండగానే ఆమె కంటినుంచి ఒక కన్నీటి చుక్క దొర్లి పోయింది అతని చేతిమీదకి.

"పార్వతీ!" అతను చెయ్యి తీసుకొని అర్థంకాక ఆమె ముఖం పైకెత్తుకొని చూశాడు.

జలజలా పార్వతి కళ్లల్లోంచి కన్నీళ్లు జారిపోయాయి. ఆమె పిచ్చిగా అతని చేతిని తీసుకొని చుంబించింది. అతని ఒడిలో తల దాచుకుంది. సన్నజాజి పరిమళాలు అతని శరీరాన్ని మత్తెక్కిస్తున్నాయి. పార్వతి శరీర స్పర్శతో అతని శరీరం వేడెక్కిపోతూంది. కాని అతని మనస్సుమాత్రం భయపడుతూ పిటినుంచి పరిగెత్తిపోతూంది.

ఆమెను పరిశీలించడంలోనే నిమగ్న మైన అతని మనస్సు ఆమెచేతలన్నిటితోనూ ఏకీభవించలేదు. అతని శరీరం ఆమె మృదువైన బాహువుల్లో బలంగా బంధింపబడింది. ఆమె పెదవులు సంతోష పారవశ్యంలో అతని ముఖంలోని అణు వణువునూ వెదకుతున్నాయి.

తిరిగి తెల్లవారింది. ముందు రోజులాగే అన్నీ అమర్చింది. పార్వతి పరిచర్యలో ఉక్కిరి బిక్కిరి అయ్యి చివరకు కాలేజికి వెళ్లాడు రాజశేఖరం.

పార్వతిలో వచ్చిన మార్పు ఆమె నెంతో సంతోషపరచింది. క్షమించరాని నేరాన్ని దిద్దుకుంటున్నాననే సంతృప్తి పొందగలిగింది. రాజశేఖరం కూడా అన్ని విధాలుగాసంతృప్తి పొందడమే ఆమె జీవితానికి పరమావధి. అతని విండిపోయిన మనస్సును చిగురింపజేయాలి. తనసుంచి ఏహ్యంతో దూరంగా పారిపోయిన అతన్ని దగ్గరకు తీసుకొనివచ్చి తన సేవ లలో బంధించి వేయాలి. అతను తన్ను క్షమించేసని అనాలి. తనను అతడు కూడా ప్రేమించి ఆరాధించే రోజు మళ్లీ రావాలి. అయితే తన ప్రయత్నంలో తా నెంతవరకూ విజయాన్ని సాధించింది ఒక్కసారి అతని డైరీ చూస్తే. డైరీ చూసినట్లు రాజశేఖ రానికి తెలిస్తే......అతను మరీ అసహ్యించు కుంటాడు. ఒక్కసారి......ఒక్క సారి......

# హింస

(27 వ పేజీ తరువాయి)

చూడాలి. తన సర్వస్వం అతని సేవలో అంకితం చేయడానికి సిద్ధంగా ఉన్నప్పుడు. ఒక్కసారి అతని డైరీ చూస్తే తప్పే ముంది.

రాజశేఖరం డ్రాయరు తాళం చెవులు డ్రాయరుమీదే పెట్టి వెడతాడు. పార్వతి తొందరగావెళ్లి డ్రాయరు తీసింది. వణుకు తూన్న చేతులతో నీలిరంగు డైరీతీసింది. ఎర్రని తాడు ఉంచిన పేజీ తెరిచింది.

"ఒకనాడు పార్వతి క్రీగంటి చూపు కోసం, ఆమె పెదవులపై చిరునవ్వుకోసం, ఆమె ఆలింగనంకోసం, తహతహలాడేను. నా మనస్సు ఎడారి అయేవరకు పార్వతి చిచ్చు రగిలించింది. నా ఆవేదనకు నే నే సానుభూతి చూపించుకోవడంలో సంతృప్తి పొందుతున్నానేమో! పార్వతి ఈ రోజున చేసింది నటనైనా, నిజమైనా నాకుమాత్రం ఆ సంతృప్తి కూడా లేకుండా చేస్తూంది. నిజం చెప్పాలంటే గతంలో పార్వతి చూపిన నిర్లక్ష్యం కంటె ఈరోజు ఆమె సేవలే నన్నెక్కువ బాధిస్తున్నాయి."

అప్రయత్నంగా పార్వతి కళ్లలో నీళ్లు నిండాయి.

అడుగుల చప్పుడు కాగానే ఖంగారుగా ఉలిక్కిపడి వక్కకు చూసింది పార్వతి. రాజ శేఖరం తలుపు పట్టుకుని నిలబడి ఉన్నాడు. కాలేజికి వెళ్లిపోతూ, ఏదో మరచిపోయి తిరిగి వచ్చిన రాజశేఖరాన్నిచూసి పార్వతి తడబడి డైరీ డ్రాయరులో పెట్టబోయి, పెట్టలేక చిన్నబోయిన ముఖంతో అలాగే నిలబడి పోయింది. రాజశేఖరం ప్రక్క కొచ్చేడు.

పార్వతి తలెత్తి బెదురుతూ అతని కళ్ల లోకి చూసింది. విపరీతమైన అసహ్యంతో కనుబొమలు ముడిచి చూస్తున్న అతని చూపును భరించలేకపోయింది. "అలా చూడ కండి" అంది పార్వతి వెనక్కి తగ్గుతూ. రాజశేఖరం మాట్లాడకుండా ఆమె చేతిలో డైరీ తీసుకొని డ్రాయరులో పెట్టి తాళం వేశాడు.

"మనిషిని హింసించడానికి ఇంకా చాలా మార్గా లున్నాయి పార్వతీ! ఇలా ఇంత సభ్యత లేకుండా మనసులతో ఆడుకోవడం మంచి పని కాదు!!"

అతను విసురుగా బయటకు వెళ్లి పోయాడు.

పశ్చాత్తాపం మనస్సును దగ్ధంచేస్తూంటే, ఆమె పరితాపానికి సానుభూతి దొరకక, కళ్లను కన్నీటి పొరలు కప్పగా మొదలు నరికిన తరువులా పక్కనున్న పరుపుపై కూలిపో యింది పార్వతి. ●



"ఎందుకు ఒప్పుకోండా? ఇట్లా వంగ ఉంటే సరి."

"అయితే పద."

ఇద్దరూ కలిసి చలపతి పడుకున్నవూరి పాక కేసి నడిచారు. లోపల నుండి ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు విన్పిస్తున్నాయి. చలపతిది ఎంతో మంచి కంఠం. వయొలిన్నూ, వీణనూ ఆ స్వరంతో పోలిస్తే, ఆ స్వరం చిన్నవోతుంది. వెన్నెల కన్నా చల్లగా, తేనె కన్నా తీయగా, మనసును తాకుతుంది. ఆయన పాట. చలపతి తన్మయుడై పాడు కొంటున్నాడు. కిర్రుమంటూ తలుపు తెర్చు కుంది. తండ్రీ కొడుకులిద్దరూ లోపలకు ఒక్కసారే ప్రవేశించారు. ధ్యానం భంగమై కళ్ళు తెరచి, ఎదుటికి చూసి, "ఇదేమిటి? ఇద్దరూ ఒక్కసారే వచ్చారు? ఏదో పని మీదే వచ్చి వుంటారు. అవునా?" అని నవ్వుతూ ఆహ్వానించాడు చలపతి వాళ్ళ ఇద్దర్నీ లోపలకు. వాళ్ళు కూచున్నారు. మంచితీర్థం పుచ్చుకొన్నారు. చలపతి ఆరోగ్యం గురించి ప్రశ్నించారు, కొత్తవాళ్ళ వలే. చివరకు, చిట్ట చివరకు జమదగ్నే పిల్లిమెడలో గంట కట్టవలసి వచ్చింది. అంతా వివరించి చెప్పి, "ఎంతో నా కుటుంబానికి చేశావ్! ఏం చేసినా తీరని ఋణం నీది! ఇప్పుడీ పని చేసిపెట్టు. తప్పదు."

చలపతి ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నాడు. ఆలోచించుకున్నాడు. కళ్ళు తెరిచి, తల వూపుతూ, "నన్ను క్షమించు జమదగ్నీ! ఈ ఆస్తిని నేను తాకట్టు పెట్టలేను." అన్నాడు విచారంగా. జమదగ్నికి నెత్తిన పిడుగు పడినట్లయింది. అతనికి తనకు వినిపించిన మాటలు నిజమో, కాదో తెలియలేదు. చలపతి మీద క్రమక్రమంగా పేర్చుకుంటూ వచ్చిన నమ్మకం, పెంచుకుంటూ వచ్చిన ప్రేమ, మంచుకొండలా పెరిగి, ఒక్క సూర్య కిరణ స్పర్శకే కరిగిపోయినట్లయింది. మోహం వ్రేలాడవేసి!

"అట్లా అనకు! నీ మీదే నమ్మకం పెట్టుకున్నాను." అన్నాడు.

"అందుకు నేను చాలా, చాలా కృతజ్ఞుణ్ణి! కానీ మీ నమ్మకానికి తగ్గట్టుగా ప్రవర్తించలేక పోతున్నాను. మీరు చెప్పిన పని చెయ్యలేకపోతున్నాను."

# కరుణ

(19వ పేజీ తరువాయి)

"కారణం?" ప్రసన్న అడిగాడు.

చలపతి నవ్వాడు. సర్వ జీవితాన్నీ అపహాస్యం చేసే నవ్వు "కారణమా? ఇంత వరకూ నా జీవితానికొక చుక్కానిలేదు. ఇప్పుడిప్పుడే మన్మథ నన్ను తండ్రి క్రింద భావించుకో గల్గుతున్నాడు. ఈ ఆస్తి తాకట్టు పెట్టి, అది తీర్చుకోలేక నాకట్టు అయి, వాడికి చివరకు నేనేమీ ఇవ్వలేకపోతే నన్ను గూర్చి వాడేమనుకొంటాడు? జీవితాంతం నేను చేసిన పనికి దుఃఖిస్తాడు. అవునా?"

"తన చెల్లెలు పసుపుకుంకుమ క్రింద ఖర్చు పెట్టాననుకొంటాడు. ఆ పరిస్థితి వస్తే!" ప్రసన్న కోపంతో జవాబు చెప్పాడు.

"మంచిదే! ఆ ప్రేమలు వుండవలసిందే!! అట్లా ఇప్పుడే వాడనుకొన్నా నాకేం అభ్యంతరం లేదు. సంతోషంగా ఈఆస్తి వాడికిచ్చేస్తాను.వాడిష్టమొచ్చినట్లు చేసుకోవచ్చు."

"అయితే మేం వాణ్ని ఆశ్రయించమనా మీ ఉద్దేశ్యం?" ప్రసన్న, చలపతి మాటల్లోని అంతరార్థం వెతుకుతూ అన్నాడు.

"చిన్నవాడివైనా బాగా గ్రహించావు. ఈ ఆస్తి వాడిది. నేను దీనికి ధర్మకర్తను మాత్రమే! ఇందులో చిల్లిగవ్వ నేను వాడుకోను! వాడికి తెలీకుండా ఖర్చు పెట్టను. మీరు వాడికి ఉత్తరమే రాసుకుంటారో, వాణ్ని ఇక్కడకుపిల్చుకుంటారో,మీఇష్టం!"

జమదగ్ని బాధగా, డగ్గుత్తికతో అన్నాడు "వాణ్ని నేనురా నీకు పెంపకాన్నిచ్చింది!!"

"అవును. అందు కోసమనే ఈ ఆస్తిని ఇంతవరకూ మిమ్మల్ని వాడుకో నివ్వాను. వాడిహా పెద్దవాడైనాడు. వాడి బాగోగులు కూడా చూసుకోవద్దు నేను?"

"ఇహ మాటలు అనవసరం. వెళ్లిపోదాం రానాన్నా! బాబాయ్‌ని ఇదివరకటి బాబాయ్ అనుకోవడం మనది పొరపాటు, ఆయన పూర్తిగా మారిపోయాడు. పిచ్చి ప్రేమ ఆయన పిచ్చివాణ్ని చేస్తోంది. మన బాధలుమనవి!మన కష్టాలు, మనబ్రతుకులు మనవి! ఇహ ఆయనకూ మనకూసంబంధం లేదు. ఆయన్ని మీరు అర్థించవద్దు."

ఆ మర్నాటి ప్రొద్దున్నే, ఇంటి కోసం బయలుదేరి, ఎక్కేగడపగా, దిగేగడపగా అన్వేషణ సాగించాడు ప్రసన్న. శారదాంబ అతని ప్రయత్నాన్ని వారించింది. కాని ప్రసన్న వినలేదు.

"ఒహాళ్ళ దయాధర్మం మీద ఆధారపడి ఎంతకాలం బ్రతకగలమమ్మా మనం? నాకు రెక్క లిప్పించారు మీరు! అవి చల్లగా వున్నంత కాలం మీకేం భయంలేదు."

ప్రసన్నతో లాభం లేదనుకొని, జమదగ్నికి చెప్పి చూసింది శారదాంబ. "దీంతో కొడుకులూ కొడుకులూ వేరవుతారు. అన్నదమ్ముల కన్నా ఎక్కువగా వున్న మీరు వేరవుతారు? నా మాట వినండి." అన్నది వేదనతో. "కాదే? నేను పెంచినవాణ్ని నేను ఆశ్రయించనా? నా కొడుకు కాళ్ళు నేను పట్టుకొని, 'ఒరేయ్, నీ చెల్లెలు కాపురం నిలబెట్టరా' అని అడగనా? అంత కన్నా మరణం మంచిదే నాకు?" అంటూ జమదగ్ని వీధిలోకి వెళ్ళిపోయాడు.

చివరకు శారదాంబ, చలపతికి కూడా చెప్పి చూసింది. ఆమె చెప్పిందంతా విని, వణుకుతున్న కంఠంతో, కళ్ళల్లో నీళ్లతో అన్నాడు చలపతి. "వదినా! మీరైనా నన్ను అర్థం చేసుకోండి! నాకు వీరభద్రం అంటే ఇష్టంలేదు. అతని నాలకమే నచ్చలేదు నాకు. వెయ్యి రూపాయలు పట్టి పుణ్యానికి పోతాయని నాకు నమ్మకంలేదు. అటువంటి వాడి కోసం, మన్మథను అన్యాయం చేయనా? మన్మథ మీకు మాత్రం కొడుకు కాదా? ఇహ విడిపోవడమంటారా? ఇవ్వాళ కాకపోతే, రేపైన అన్నగారు తన తప్పు గ్రహించకపోరు."

శారదాంబ ఆయనకు తిరిగి సమాధానం చెప్పలేకపోయింది.వెళ్ళేరోజున ప్రసన్నఅన్నాడు.

"మీ తత్వం నాకు ఆనాడే తెలిసింది. పాలేళ్ళ కిస్తానన్న డబ్బు మన్మథ కిచ్చి పంపించారు. నా చదువు మానిపించారు."

చలపతి సమాధానం చెప్పలేదు. పోగి పోతున్న రిక్షాల కేసి, సామాన్లు ముందు పెట్టుకు కూచున్న జమదగ్ని దంపతుల కేసి సజలనయనాలతో చూశాడు. అతనికి ప్రపంచమంతా మసకమసకగా కన్పించింది.

(శేషం)

ఉపయోగించరు. కూచిపూడి నాట్యం, భరత నాట్యంలకి వలెనే మృదంగం మణిపురియందు కూడా ప్రముఖపాత్ర వహిస్తుంది.

మణిపురి నృత్యమునందు దేవతల ప్రణయ గాథలనుచూపే నృత్య నాటికలు ఎన్నో కలవు. అన్నిటిలోకి బహుళ ప్రచారము పొందినది 'రాస లీలా నృత్యం'. ఈ 'రాస లీల' మహారాసలీల, వసంతలీల, మంజరాసలీల, నిత్య రాస లీల, గోపరాసలీల, ఉత్కలరాసలీల' అని ఆరు రకములు. ఈ రాసలీలల ప్రధాన లక్ష్యం శ్రీ మహావిష్ణు ఆరాధన. అందుచేతనే మణిపురి నృత్యం ఆనందానుభూతితోపాటు ఆధ్యాత్మికచింతను కలిగిస్తుంది. నిజం చెప్పాలంటే మణిపురి నృత్యం ప్రసిద్ధి పొందుటకు రాధా కృష్ణుల భక్తితత్వాన్ని వెల్లడిచేసే ఈ రాసలీలలే కారణం.

## ఒడిస్సీ నృత్యము

ఒడిస్సీ అనగా ఒరిస్సాకు సంబంధించినదని యర్థము. ఒడిస్సీ నృత్యము కూడా చాలా పురాతనమైనది. శాసనాధారములు కాని, ప్రమాణ గ్రంథములుకాని లేకపోయినప్పటికీ, పురాతన శిల్ప ఖండములబట్టి ఒడిస్సీ ప్రాచీన కాలమునుండి ఆరాధింపబడుచున్నదని చెప్పవచ్చును. అయినప్పటికి 16 వ శతాబ్దినుండి సరియైన ప్రచారము, పోషణలేక క్షీణించిపోయినది. ఎట్టొచ్చి ఈ శతాబ్ది మధ్య భాగంనుండే మరల కొందరు కళాకారుల కృషి ఫలితంగా తిరిగి పుంజుకొని ఒక స్థాయికి చేరుకొన గలిగింది.

ఒడిస్సీ దక్షిణ దేశ భరతనాట్యాన్ని పోలి ఉంటుంది. 'భరతుని నాట్య శాస్త్రము', 'నందికేశ్వరుని అభినయదర్పణము', 'మహాపాత్రుని అభినయ చంద్రిక'లు ఒడిస్సీ నృత్యానికి మూలాధారణము. ఒడిస్సీలోకూడా హస్త ముద్రికలు ప్రాధాన్యము వహిస్తాయి. భరత నాట్యములో ఇరువది నాలుగు అసంయుత హస్తములుండగా ఒడిస్సీయందు ఇరువది మాత్రమే ఉపయోగించెదరు.

ఒడిస్సీ నృత్త నృత్యానుబంధము కలిగియుంటుంది. ఒడిస్సీ నృత్యము 'మంగళాచర

# నృత్య రీతులు

(21 వ పేజీ తరువాయి)

ణము'తో ప్రారంభించబడును. ఇందు వినాయకుని శ్లోక రూపమున స్తుతించెదరు. తరువాత వరుసగా 'బటు', 'పల్లవి', 'అభినయము' మున్నగునవి ప్రదర్శింతురు. చిట్ట చివరగా 'మోక్షనట' ప్రదర్శింతురు. 'మోక్షనట' యనగా చివరిది అని అర్థము. ఒడిస్సీ నాట్యమునకు ఉపయోగించు సంగీతము హిందుస్థాని సంగీతమును పోలి ఉంటుంది. ఆంధ్రదేశాన్ని అనుకొనియున్న ఒరిస్సాయొక్క ఒడిస్సీ నృత్యం, ఆంధ్రదేశ నృత్యాలని పోలి యుండుటలో ఆశ్చర్యంలేదు.

## అంకియానట్

అస్సాము ప్రాంతమందలి నృత్యము 'అంకియానట్'. ఇది అస్సాం ప్రాంతమందు విశేష ప్రచారము నొందినది. అంకియానట్ సాంప్రదాయసిద్ధమైన నాట్యము. ఇది కూడా భరత నాట్యమును పోలియుండును. ఈ నృత్యమును సుమారు 500 సంవత్సరముల క్రితము శ్రీశంకరదేవ ప్రచారములోకితెచ్చెను. శ్రీ శంకరదేవ ఈ నృత్యమునకు మూల పురుషుడని చెప్పవచ్చును. అంకియానట్ నృత్యములన్నియూ వైష్ణవ సంబంధమైన కృష్ణ గాథలే. ఈ నృత్యములకు దేవాలయములు నిలయములు. అస్సామునందు ప్రతి దేవాలయమునందు ఒక నృత్య కళా మందిర ముండి ఈ నృత్యములకు చక్కటి ప్రోత్సాహము ఇస్తున్నవి.

మన దేశములో నాట్యకళ ప్రాచీనకాలము నుండికూడా లావణ్యంతో తొణికిసలాడుతూ నేటివరకు శోభాయమానంగా రాణించుచున్నది. అందుకు కారణము ఆ యా నృత్య రీతులలోని కళాకారులు భక్తి ప్రపత్తులతో తమ విద్యలందు కృషి చేయుటయే. ఒక్క విషయంమాత్రం మనము మరువరాదు. పై నృత్య రీతులలో ఒకటి ఎక్కువ మరొకటి తక్కువకాదు. నిజానికి ఒక్కొక్కదాని యందు ఒక్కొక్క విశిష్టత ఉన్నది. ●

# యాచక-కయాలు

పెండ్యాల నాగాంజనేయులు

యాచన అనగానే మూడురకాల బిచ్చగాళ్ళు మాత్రమే ముందుగా మన దృష్టికొస్తారు. వీళ్ళు 1. బియ్యపు బిచ్చగాళ్ళు, 2. అన్నం బిచ్చగాళ్ళు, 3. డబ్బుల బిచ్చగాళ్ళు.

వీళ్ళు కాక వేరే బట్టల బిచ్చగాళ్ళు, గడ్డి బిచ్చగాళ్ళు, చెప్పుల బిచ్చగాళ్ళు మొదలైన వాళ్ళెందరో.

'రామచంద్ర పరబ్రహ్మణేనమః' అనిగానీ, 'భవతి భిక్షాందేహి' అనిగానీ అడుక్కుంటే కొత్తేంకాదు. 'ఆ చేత్తోనే ఇలా పడెయ్యమ్మా' అనిగానీ 'ఇక్కడ మేమూ ఉన్నాం' అనిగానీ అడుక్కున్నా కొత్తేంకాదు. కానీ, మద్రాసులో బిచ్చగాళ్ళు మాత్రం నాకు కొంచెం వింత కలిగించారు. రేషనింగు రాకపూర్వం బియ్యానికి విపరీతంగా కటకట పడాల్సి వచ్చింది. ఒక మా శ్రీమతి గబగబా ఓ గుప్పెడు బియ్యం పట్టుకొచ్చింది వెయ్యడానికి.

"ఏవమ్మా బియ్యం చూపించండి" అన్నాడు బిచ్చగాడు ఆత్రంగా. మా శ్రీమతి బియ్యం చూపించింది.

బిచ్చగాడు మొహం ముడుచుకున్నాడు. పైగా.... "ఇదేవిటమ్మా ఈ అమెరికా బియ్యం గొడ్లు కూడా వాసన చూడవు. నెల్లూరు బియ్యం పెట్టమ్మా" అంటూ డబాయించాడు.

శ్రీమతికి కొంచెం కోప మొచ్చింది. "ఆఁ మరి నీ కోసం నెల్లూరు బియ్యం తెప్పించి పెడ్తా పాపం. ఇష్టమైతే జోలి పట్టు. లేకపోతే మానెయ్. మేం తినేవివే" అంటూ వెనక్కి తిరిగింది.

వాడు మాత్రం తక్కువ తిన్నాడా? "చాల్చాల్లేవమ్మా! ధర్మం చేసేప్పుడు చెత్త ఇక అన్నం బిచ్చగాళ్ళు!

"మాతా, అన్నపూర్ణేశ్వరీ! కాస్త అన్నముంటే పెట్టుతల్లీ" అంటూ వస్తుందో బిచ్చగత్తె.

"ఇంకా వంటకాలేదు. వద్దన్న మేమీ మిగల్లేదు వెళ్ళు" అంటుంది ఓ ఇంటావిడ మాట వరసకి.

"వంటయ్యే దాకా ఉంటానమ్మా, వేడన్నమే పెట్టు" అంటుంది బిచ్చగత్తె నిబంగానే.

ఇంటావిడ కొంచెం చిక్కుల్లో పడుతుంది.

"సర్లే ఇక్కడే కూర్చోడ మెందుకు? అలా ఊళ్ళోకి వెళ్ళి 12 గంటలకు రా" అంటుంది.

అది సరిగ్గా 12 గంటలకే వచ్చి కూచుంటుంది విచిత్ర మేమిటంటే అది ఊళోగా నాలోచోట అడుక్కోదు



వాడో బిచ్చగాడు 'అమ్మా కాసిని నెల్లూరు బియ్యం పెట్టుతల్లీ' అంటూ వచ్చాడు మా ఇంటికి.

అసలే నెల్లూరు బియ్యం దొరకడం గగనంగా ఉండేది. అది కూడా మంచి బాలుడల్లే వేకువ జామునే లేచి, చెడ్డ బాలుడల్లే కాలకృత్యాలు, స్నానం కూడా మానేసి, వెళ్ళి టి. యు. సి. యస్. వారి దుకాణం ముందు రైలాట ఆడితేను! ('రైలాట' అంటే క్యూలో నిలబడ్డం అని మీరు గ్రహించే ఉంటారు.)

నెల్లూరు బియ్యం ఖరీదెక్కువ. అందువల్ల చీప్, చిక్కీకోసం, సరిపెట్టుకుపోయే వాళ్ళ కోసం అప్రాచ్యదేశపు బియ్యం (అమెరికావి) దిగుమతి చేసి తక్కువ ధరల కమ్మేవారు. ఇవి మాత్రం పుష్కలంగా దొరికేవి. "మా ఇంట్లో ఇవే వాడేవాళ్ళం, బియ్యం, కూళ్ళపళ్ళు, 14 క్యారట్ల బంగారం దానం చేస్తారటమ్మా" అని ధర్మసూత్రాలతో గొప్పడి ముష్టి తీసుకోకుండానే వెళ్ళిపోయాడు.

అయ్యో వీడు 'మీసాలకు సంపెంగ నూనె' రాసుకునే బాపతు.

మరోసారి మరో బిచ్చగాడు "అమ్మా బిచ్చం" అంటూ వచ్చాడు.

'బియ్యం నిండుకున్నాయి వెళ్ళు' అన్నాను.

వెంటనే వాడు "పక్కింటా యనిప్పుడే కొనుక్కొచ్చాడు బాబూ. వాళ్ళింట్లో ఓ పడి అప్పు తీసుకోండి. కాసేపు నిలబడ్తాలెండి ఫరవాలేదు" అంటూ శాంతంగా సలహా ఇచ్చాడు. ఇదేమన్నా బాగుందా చెప్పండి. వాడిని నాలుగూ చెరిగితేనేగాని వెళ్ళాడు కాడు.

ఓనాడు మా పక్కింటావిడ ఒక బిచ్చగాడికి అన్నం పెట్టింది కూరతో సహా. వాడు సంతోషంతో వెళ్ళి పోగూడదూ? ఊహూ ఏదో గునుస్తూ కూర్చున్నాడింకా.

"ఏవిట్రా ఇంకా కూర్చున్నావు? పో" అందావిడ.

"కొంచెం పెరిన నెయ్యి వెయ్యండమ్మా! బొత్తిగా గొడ్డుకూరెలా తినేది?" అన్నాడు వాడు తలొంచుకు నసుగుతూ.

అసలే నేతి ఖర్చుకు తట్టుకోలేక మానేయడమో, నువ్వుల నూనె, డాల్డాలు వాడుకోవడమో చేస్తూంటే వీడి కోరిక చూడండి

ఓ దీపావళినాడు అన్నం, పప్పు, కూరలు గార్లతో సహా పెడ్తే, ఓ బిచ్చగాడు అన్నం వంక, మా శ్రీమతి వంకా నాలుగుసార్లు పరకాయించి చూసి, "ఏవమ్మా పరమాన్నం పెట్టారు కాదు?" అని నిలదీసి అడిగాడు.

4—3—65

"మిగల్లేదబ్బాయ్" అంది శ్రీమతి.

"ఎంతువ్నా మీ పొట్టలకే సాలదు" అని ఓ నిష్ఠూరం వేసి లేచిపోయాడు బిచ్చగాడు.

వాళ్ళేం చెయ్యాలి చెప్పండి !

పోతే—డబ్బుల బిచ్చగాళ్ళు.

వీళ్ళు సాధారణంగా ఇళ్ళకు రారు. బజార్లోనూ, బస్సుస్టాండుల్లోనూ, రైల్వే కంపార్ట్‌మెంటుల్లోనూ కిటకిట లాడుతుంటారు.

"అయ్యా కళ్ళులేని కబోదిని, ఓపైసా దానం చెయ్యండి బాబూ" అనే గ్రుడ్డి వాళ్ళూ,

"ఆహా భ్రమ్మ వత్తం పోధమ్మంటే షిఖతేమిర అణ్ణాయా" అనే రైల్వే గాయక బిచ్చగాళ్ళూ మనకు సుపరిచితులు.

కాని మద్రాసులో—

ఒకడు బస్‌స్టాండులో నిలబడుంటాడు. మనం వాణ్ణి సమీపించగానే వాడు తన చేతిలో 5 పైసల నాణెం మనకు చూపిస్తూ "సార్ ఒక్క మూడు పైసలుంటే ఇస్తారా? బస్సుకు తక్కువయ్యాయి" అంటాడు. వీడెక్కడా మనకి బిచ్చగాడిలా కనిపించడు. చక్కగా క్రాఫింగు దువ్వుకుంటాడు. ఓ మాదిరి గుడ్డలు ధరిస్తాడు. వీలయితే చేతిలో ఓ ఎర్రరంగు నీళ్ళ సీసా కూడా వుంటుంది. ఎందుకో తెలుసా? ఒకవేళ మనం వాడడిగిన దానం చెయ్యడానికి వెనకాడితే, తనకు జ్వరంగా వుందని తెలియజేసి, దాన్ని నిరూపించేందుకు ఆ సీసా కూడా చూపిస్తాడన్నమాట.

ఆ దెబ్బతో మనం బోలెడు జాలిపడిపోయి వాడికి మూడు పైసలూ దానంచేసి మన దోవనపోతాం. కాని వాడు మాత్రం బస్సెక్కడు. అక్కడేవుండి (భోజనవేళదాకా) 'తన' అయిదు పైసల బిళ్ళతోనూ బోలెడు వ్యాపారం చేసేస్తాడు.

మరోవాడు— మన దోవన మనం పోతూంటే మంచి పాంటూ షర్టూ వేసుకుని ఎదురుగా వచ్చి 'నమస్కారం బాబుగారూ' అంటాడు భక్తి వినయిస్తూ. ఇది ఎక్కువగా ఘనత వహించిన పాండీ బజార్లో జరుగుతుంది.

వాడెవడో మనకు తెలియకపోయినా, నాకు నమస్కారం పెట్టాడు గదా అని ఏదం కనీసం ఒక్క చిరుదరహాస చంద్రిక నైనా పారేస్తాం.

వాడు దగ్గరకొచ్చేసి "బాబుగారూ ఓ పది పైసా లిప్పించండి మీ చేత్తో. నాకు కలిసొస్తుంది" అంటాడు చేయిజాపి.

"వాడికి కలిసొస్తుందట. మన చెయ్యి అంత మంచిదిగావన్ను" అని మనం కొద్దిగా గర్వపడి, కొంచెం తమాయించుకుని, తెలివిగల వాళ్ళం గదా అని భ్రమించి, మరోసారి వాడి నోటివెంట అదేమాట వినాలని కుతూహలంగల వారమై, ప్రకాశంగా,

"నీ మొహం, నేనివ్వడమేమిటి? నీకు కలిసి రావడమేమిటి?" అనేస్తాం.

"అమ్మమ్మమ్మ అలా అనకండి సార్ మీ చెయ్యి విలువ మీకేం తెలుసు? నాక్కు




తెలుసుగాని. మీకు జ్ఞాపకముందో లేదో... పోయినేడు సంవత్సరాది నాడు మీర్చు నాకో పావలా ఇచ్చారు. ఆ రోజున నాకు వంద రూపాయలు దొరికాయి మహాయోగంగా" అనేస్తాడు వాడు.

(మరి ఆ దొరకడం రోడ్డు మీద దొరికాయో, ఎవరి జేబులోనైనా దొరికాయో, లేకపోతే ఇలాగే అడుక్కుంటే దొరికాయో వాడికీ, దేవుడికీ మాత్రమే తెలియాలి.) పైగా వాడి కిదివరకు మనం ఇచ్చామో లేదో ఎవడికి జ్ఞాపకం? పొగడ్తలకు సాధారణంగా ఎవరైనా లొంగిపోవాల్సిందే గాబట్టి కొంచెం ముందూ వెనగ్గా లొంగిపోయి ఓ పావలా, లేక ఓపది పైసలూ వాడి చేతిలో పెట్టి (అప్పయినా చేసి) విశ్వమిస్తాం మన హస్తవాసికి మురిసిపోతూ. అక్కడి నుంచీ వాడు మనకు త్రివిక్రముడై కనిపిస్తాడు. వారానికో సారి ఇదే పల్లవి పాడుతూ.

మరోరకం—పాండీబజార్లో పోతూంటే మన వెనక నుంచి 'సార్ సార్' అని విని

పిస్తుంది. మరి మనం బాగా ఇలాటి వాటికి అలవాటు పడ్డ వాళ్ళంగాబట్టి 'పోవయ్యా' అనో, 'చిల్లర్లేదు' అనో, లేకపోతే పిత్తరించుకుంటూనో పోబోతాం.

'సార్' తాలూకు అసామి మనం అతణ్ణి డబ్బు లడుక్కునే వాణ్ణిగా భావించామని వాసన పట్టేసి, ముందుకొచ్చి కాళ్ళ కడ్డంపడి

'సార్ నాకు డబ్బూ దస్కం మొద్దు సార్ రెండిడ్లీ ఒక కాఫీ చాలు" అంటాడు.

డబ్బయితే ఏదో ఇస్తాం— వదిలించుకుంటాం. కాని వీడి కోరిక తీరాలంటే 36 పైసలు కావాలే. అదీ ఇడ్లీన్నతో వెయ్యడక్కుండా వుంటేనూ. పోనీ గదా తిండిలేక ఇదైపోతున్నాడు అని మన మనుష్యు కూడా మానుకుని వాణ్ణి హోటలుకు తీసికెళ్ళమా, వాడిష్టమొచ్చినవి ఆర్డరిస్తాడు. వాడితో అక్కడ వాదనేసుకుని అల్లరి పడ్తామా? పడం. నోర్మూసుకుంటాం. కళ్ళల్లో కోపంతో మనసులో దుఃఖంతో ఉహూ, ఇదైపోతాం. వాడసలివేవీ కనిపెట్టడు. వాడి పని వాడు చేసుకుపోతూంటాడు. దాంతో మనకి వైరాగ్యం పుడ్తుంది. "వెధవ డబ్బు ఇంత ఖర్చు కాబోతూంటే మనం కూడా రెండిడ్లన్నతో బాటు కాఫీ సేవిస్తే తప్పేమిటి?" అని. వెంటనే మన కోరిక, లేక కసి తీరిపోతుంది. బయటపడేసరికి సాధారణంగా జేబు ఖాళీగానే వుంటుంది.

బయటపడ్డాక "సార్! చాలా థాంక్స్ సార్. నా ప్రాణం నిలబెట్టారు. వస్తా సార్ టైమైంది. కంచికి వెళ్ళాలి" అనేసి గభాల్ని అప్పుడే వచ్చిన బస్సెక్కి కంచి వెళ్ళిపోతాడు. (కంచికేనా?)

మనం క్వశ్చన్‌మార్కు మొహంతో కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వచ్చేస్తాం. ●





'పరమానందయ్య శిష్యుల'లో ఎన్. టి. రామారావు, ఎల్. విజయలక్ష్మి.

జనవరినెల, క్రొత్త సంవత్సరంతో శాంతి మాసంలో చిత్ర సీమ మూడు పూవులు ఆరు కాయలుగా వెలిగిపోయింది. నిరాశ, నిస్పృహలతో 1965 సంవత్సరం ముగిసిందనే బాధ ఒక వైపున్నా, తదనంతరం జరిగిన సంఘటనలు, వెలుగులోకి వచ్చిన క్రొత్త భావాలు ఎంతో ఆశాజనకంగా ఉన్నాయి.

జనవరిలో నాలుగు చిత్రాలు విడుదల అయాయి. నాగేశ్వరరావుగారి దొకటి ఎన్. టి. రామారావుగారి దొకటి పెరిద్దరూ లేనివి మరి రెండు. 'జమీందార్' చిత్రం నాగేశ్వరరావు పటిభను మరొకమారు తారస్థాయికి చేర్చింది. 'శ్రీ కృష్ణపాండవీయం' చిత్రానికి పర్యాయపదం ఎన్. టి. రామారావీయం! 'మొనగాళ్ళకు మొనగాడు' తెలుగువారికి బాగా నచ్చుతుంది (అందులో యస్. వి. రంగారావు, తను మరోమారు 'పాతాళభైరవి'ని సృష్టించుకొన్నారట!) 'ఆటబొమ్మలు' కూడ జనవరి విడుదలే

ఫిబ్రవరి మొదలవుతుండగా 'రోగుట్టు పెరుమాళ్ళు కెరుక' విడుదలయింది విడు

# సమకాలీన చిత్రసీమ...



'ఎర్రగులాబి'లో బేబి పద్మిని, బేబి విజయ.

దలకు ముస్తాబవుతున్న చిత్రాలు ఎన్నో ఉన్నాయి. శ్రీ అనురాగాసాగార 'పల్నాటి యుద్ధము' క్రొత్త చరిత్రను సృష్టించ గలదని ఆశిస్తున్నారు. నాగేశ్వరరావుగారి స్వంత చిత్రం 'ఆత్మ గౌరవం' అందె వందాలు అలంకరించుకొంటుంది.

తయారవుతున్న చిత్రాల మాట చెప్ప నక్కరలేదు. ముడి ఫిలిం కొరత ఉన్నప్పటికీ చిత్రాలు తయారవుతూనే ఉన్నాయి 'భక్త పోతన' నిర్మాణం ఈ నెలతో అయిపోతున్నది. "జగాదే పరమానందయ్య శిష్యుల కథ" (వత్యాగాత్మగారి 'చిలకా—గోరింకా' అరుణాచల (పొడక్షన్స్‌వారి 'స్త్రీ' మొదలయిన చిత్రాల నిర్మాణం ముగింపు కొస్తున్నది.

అనుకోకుండానే అక్కినేని నాగేశ్వరరావు గారు మదరాసుకు (మదరాసుకే!) వచ్చారు. రామారావుగారు ఈమధ్యనే హైదరాబాద్

ఆబిడ్ సర్కిల్‌కు వెళ్లి తన విస్కేట్‌ని చూసుకొని వచ్చారు.

అన్నిటికంటే గొప్ప! భానుమతీ రామకృష్ణగారికి 'పద్మశ్రీ' బిరుదువచ్చింది

—ధర్మాజీ ●

# సినిమావార్తలు

## నవరాత్రి చిత్రం షూటింగ్‌పూర్తి

పి. ఏ. పి వారు సమర్పిస్తున్న విజయ చాముండేశ్వరీ పిక్చర్సు వారి 'నవరాత్రి' చిత్రం షూటింగు పూర్తి అయింది. ఈ చిత్రం షూటింగు గత డిసెంబరు 20 వ, తేదిని ప్రారంభమయింది ఫిబ్రవరి 20 వ, తేదీతో షూటింగుపూర్తి అయింది.

ఈ చిత్రంలో మొత్తం ఆరు పాట లున్నాయి. వీటిలో మూడు పాటలను దాశరధి వ్రాశారు. రెండు పాటలను కొసరాజు వ్రాశారు ఒకటి శ్రీశ్రీ వ్రాశారు ఈ ఆరు పాటలలోనూ ఒకటి వీధి భాగవతం పాట ప్రత్యేకత. ఇందులో శ్రీమతి సావిత్రి తనకు కావలసిన పాటను స్వయంగా పాడుకున్నారు తొలిసారిగా శ్రీమతి సావిత్రి పాడిన పాటను ప్రేక్షకులు యీ చిత్రం ద్వారా వింటారు

శ్రీ నాగేశ్వరరావు, శ్రీమతి సావిత్రి యీ చిత్రంలో ముఖ్యభూమికలు పోషించారు శ్రీ నాగేశ్వరరావు యీ చిత్రంలో తొమ్మిది వేరువేరు వేషాల్లో కనిపిస్తారు

ఈ చిత్రంలో యింకా జగ్గయ్య, గుమ్మడి, పద్మశ్రీ నాగయ్య, రేలంగి, రమణా రెడ్డి, ప్రభాకరరెడ్డి, చలం, రాజబాబు పల్లరామమూర్తి, సీతారాం, వడలవాడ కుటుంబరావు, జమున, జయలలిత, రాజశ్రీ, కాంచన, సూర్యాకాంతం, గిరిజ, నిర్మల గీతాంజలి, హేమలత, పుష్పకుమారి, ఛాయాదేవి, బేబిపద్మిని మొదలగువారు నటించారు.

పి. ఏ. పి. సంస్థలో చాల చిత్రాలక్కు అసోసియేట్ డైరెక్టర్‌గా పని చేసిన శ్రీ తాతినేని రామారావు ఈ చిత్రానికి దర్శకత్వం వహించారు టి. చలపతిరావు సంగీత





ఆత్మగౌరవం'లో నాగేశ్వరరావు కాంచన

# సినిమా వార్తలు

## ఉదయశ్రీ ప్రొడక్షన్సు

ఉదయశ్రీ ప్రొడక్షన్సు అను నూతన సంస్థవారు తెలుగులో సాంఘిక చిత్రాన్ని నిర్మించదలవారు. ఈ చిత్రానికి మూలం హిందీలో విజయవంతమైన చిత్రం,

ఈ చిత్రంలో యస్. వి. రంగారావు. రేలంగి, జి. వరలక్ష్మి, గిరిజ మొదలగువారు నటిస్తారు. కథా నాయకుడిగా నాగేశ్వరరావు ఉంటారని తెలుస్తుంది. కథా నాయికను, మిగతా నటవర్గం ఎన్నిక జరుగుతుంది.

ఈ చిత్రానికి పాటలు సి నారాయణ రెడ్డి, కొసరాజు వ్రాస్తారు. సంగీతం: టి శంకర్, దర్శకత్వం. అడ్డాల నారాయణరావు

## రవీంద్ర ఆర్టు ప్రొడక్షన్స్ షూటింగ్ ప్రారంభం

'లక్షాధికారి' చిత్రం నిర్మించిన రవీంద్ర ఆర్టు ప్రొడక్షన్స్ వారు తమ ద్వితీయ చిత్రం షూటింగ్ ఫిబ్రవరి ఒకటవ తేదీని విజయా—వాహినీ స్టూడియోలో లాంఛన ప్రాయంగా ప్రారంభించారు

ప్రారంభోత్సవానికి పరిశ్రమలోని పలువురు పెద్దలు హాజరైనారు అతిధులకు కులు శ్రీ వి మధుసూధనరావు స్వాగతం పలికారు ప్రయివేటు హాస్పిటల్ సెట్టులో డాక్టర్‌గా రామారావు, కాంపౌండరుగా రమణా రెడ్డి ఉన్నారు వారితోనే తొలి చిత్రీకరణ జరిగినది. ఇంకా ఈ చిత్రంలో కాంచన, అంజలిదేవి మొదలగువారు నటిస్తున్నారు.

సంభాషణలు ఆచార్యఆత్రేయ వ్రాశారు. సంగీతం: టి. చలపతిరావు.

## 'రహస్యం' పదిరోజులు షూటింగ్

సదరన్ మూవీటోన్‌ను లలితా శివజ్యోతి అధిపతి శ్రీ శంకరరెడ్డి అద్దెకు తీసుకున్నట్లు, ఆ స్టూడియోకు లలితాశివజ్యోతి స్టూడియో నామకరణం చేసి ఆ స్టూడియోలోతమ చిత్ర నిర్మాణం చేస్తున్నట్టు శ్రీ శంకరరెడ్డి తెలియజేశారు

లలితాశివజ్యోతి బేనర్‌లో 'రహస్యం' చిత్రం ఫిబ్రవరి మూడవ తేదీ నుండి పదమూడవ తేదీ వరకు షూటింగ్ జరిగింది. ఈ షెడ్యూల్‌లో మూడు పాటలను చిత్రీకరించారు. మూడు పాటలు నృత్య దర్శకుడు హీరాలాల్ దర్శకత్వం క్రింద చిత్రీకరించారు. వీటిలో ఒకటి ఏడు నిముషాల పాట, శ్రీ సముద్రాల రాఘవాచార్య వ్రాసింది కూడా చిత్రీకరించారు. ఈ చిత్రీకరణలో బి. సరోజాదేవి, నాగేశ్వరరావు, గుమ్మడి, రాజనాల, లింగమూర్తి, జి వరలక్ష్మి, సి. హెచ్. నారాయణరావు, గీతాంజలి, లంక సత్యం ఉన్నారు.

మొత్తం యింతవరకు అయిదు పాటలను చిత్రీకరించారు. సగానికి పైగా





నటి జమున (ఫొటో ప్రకాశ్)

చిత్రం పూర్తి అయింది

ఇంకా యీ చిత్రంలో యస్. వి. రంగారావు, కాంతారావు, రేలంగి, రమణారెడ్డి, కృష్ణకుమారి, గిరిజ, సూర్యకాంతం మొదలగువారు నటిస్తున్నారు

కథ సంభాషణలు. శ్రీ సదాశివబ్రహ్మం వ్రాశారు పాటలు కీ. శే మల్లాది రామకృష్ణశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి సముద్రాల రాఘవాచార్య, సదాశివ బ్రహ్మం, సి. నారాయణరెడ్డి వ్రాశారు. సంగీతం ఘంటసాల, దర్శకత్వం: వేదాంతం రాఘవయ్య.

## పద్మశ్రీ భానుమతీ రామకృష్ణ

శ్రీమతి భానుమతీరామకృష్ణ తొలిసారిగా సి పుల్లయ్యగారి దర్శకత్వంలో తయారైన 'వరవిక్రయం' చిత్రంలో నటించారు. తమిళంలో కృష్ణన్‌పంజుదర్శకత్వంలో తయారైన చిత్రం 'రత్నకుమార్'లో మొదటిసారిగా నటించారు. శ్రీ కెంప్‌రాజు దర్శకత్వంచేసిన 'నలదమయంతి' కన్నడచిత్రంలో మొదటిసారిగా నటించారు. హిందీలో శ్రీ ఎస్ ఎస్ వాసన్ దర్శకత్వంచేసిన 'నిషాన్' చిత్రంలో మొదటిసారిగా నటించారు ఇవి శ్రీమతి భానుమతి వివిధ భాషల్లో నటించిన మొదటి చిత్రాలు.

'చండీరాణి' చిత్రానికి దర్శకత్వం కూడ వహించారు. 'చండీరాణి'— 'ప్రేమ'— 'కాదల్' చిత్రాలకు కథలు వ్రాశారు. 'చక్రపాణి' చిత్రానికి సంగీత దర్శకత్వం నిర్వహించారు

భానుమతిగారిచే వ్రాయబడిన 'మరచెంబు' అను చిన్న కథ ఆమె పదమూడవ ఏట ప్రచురణ అయింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆ భానుమతిగారి కథల సంపుటి అయిన 'అత్తగారి కథలు' కు అవార్డు యిచ్చింది భారతప్రభుత్వం పద్మశ్రీ బిరుదు నిచ్చి సత్కరించారు.

## డాక్టర్ చక్రవర్తి మాస్కో ప్రయాణం

డాక్టర్ చక్రవర్తి గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఒక తెలుగు నవలను ఆధారంగా చేసుకొని అన్నపూర్ణా పిక్చర్సు వారు నిర్మించిన యీ చిత్రం రాష్ట్రస్థాయిన కేంద్రస్థాయిన కూడా అవార్డులు సంపాదించుకున్నది

ఏప్రిల్ మాసంలో మాస్కోలో జరిగబోయే చలన చిత్రోత్సవాలకు డాక్టరు చక్రవర్తి చిత్రాన్ని ఎన్నిక చేసినట్లు తాజా



నటి జానకి ఫొటో : మాణిక్య త్యాగరాజన్.

# సినిమా వార్తలు

వార్త. ఉభయ దేశాల మధ్య జరుగబోయే సాంస్కృతిక వినిమయ కార్యక్రమాలకు గాను యీ చిత్రాన్ని ఎన్నిక చేశారు.

ఈ చలన చిత్రోత్సవాలు మాస్కోలో ఏప్రిల్‌లో జరుగుతున్నాయి. ఇండియా నుంచి అక్కడకు వెళ్తున్న యితర చిత్రాల వివరాలు యింకా తెలియలేదు.



'ఆత్మగౌరవం'లో రేలంగి.

డాక్టర్ చక్రవర్తి తరఫున ఆ చిత్రోత్సవాల్లో పాల్గొనేందుకు చక్రవర్తి పాత్రధారి శ్రీ నాగేశ్వరరావు, నాయిక పాత్రధారిణి శ్రీమతి సావిత్రిగణేశ్, దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు, నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూధనరావు, డిస్ట్రిబ్యూటర్ల తరఫున శ్రీ శ్రీనివాసరావుగారలు మాస్కో వెళ్లగలరని తెలుస్తోంది.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అవార్డులకు చిత్రాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు చిత్ర

లను, పరిశ్రమను ప్రోత్సాహించాలని నిర్ణయించింది. గత సంవత్సరం స్వాతంత్ర్య దినోత్సవం నాడు ఉత్తమ చిత్రాలకు, నిర్మాతలకు, దర్శకులకు, రచయితలకు అవార్డులిచ్చారు.

ఈ సంవత్సరం తెలుగు సంవత్సరాది నాడు యీ అవార్డుల ఉత్సవాన్ని ప్రభుత్వం చేయదలచింది. ఈ సంవత్సరం కూడ ఉత్తమ చిత్రాలకు, దర్శకులకు, నిర్మాతలకు, రచయితలకు వరుసగా బంగారు, వెండి, కంచు నందివిగ్రహాలు, నగదు బహుమతులు యివ్వబడుతాయి.

వరంగల్లుకు నలభై మైళ్ళ దూరంలో ఉన్న రామప్ప దేవాలయంలోని నంది యీ విగ్రహాలకు మూలం. ఒక్కొక్క నంది 2,500 గ్రాముల బరువు ఉంటుంది.

అవార్డుల ఉత్సవాల్లో పాల్గొనడానికి వక్కుటాయి, తేనెమనసులు, దొరికితే దొంగలు, పల్నాటియుద్ధం, వీరాభిమన్యు మొదలగు చిత్రాలు పదింటికి పైగా పాల్గొనినట్లు తెలుస్తుంది.

ఉత్తమ చిత్ర బహుమతి 2,500 గ్రాముల బంగారు నంది.

నిర్మాత—10,000 రూ. నగదు.

దర్శకుడు—4,000 రూ. నగదు.

ద్వితీయ బహుమతి—2,500 గ్రాముల వెండి నంది.

నిర్మాత—3,000 రూ. నగదు.

దర్శకుడు—1,000 రూ. నగదు.

తృతీయ చిత్రం—2,500 గ్రాముల కంచు నంది.

దర్శకుడు— బహుమతి ఇవ్వబడుతుంది.

ప్రథమ, ద్వితీయ ఉత్తమ రచయితలకు వరుసగా వెయ్యి, అయిదు వందలు రూపాయలు నగదు బహుమతిగా యివ్వబడుతుంది.

—ధర్మాజీ

[ 4—3—66 ]



'అగ్గిబరాటా'లో ఎన్. టి. రామారావు.



నటి జయలలిత. (ఫొటో : మాణిక్య త్యాగరాజన్.)

# పుస్తకాలు

## మాతృశ్రీ

పద్యకావ్యము. రచయితలు: కోట సోదరకవులు. క్రౌను 12+70 పుటలు. వెల రు. 1—50. కవి చంద్ర గ్రంథమాల. 147, టంకసాలవీధి, మదరాసు—1.

ఈ పుస్తకంలో గీర్వాణ భాషలో మహా విద్వాంసుడూ, కవి సార్వభౌముడూ అయిన శ్రీ హర్షుడు తన మాతృదేవి చేసిన మహా త్యాగంతో అనన్య సాధ్యమైన పాండిత్యాన్ని సంపాదించి, తండ్రిని పరాభవించిన కాశ్మీర పండితుని నిండు సభలో ఓడించి మహా ఘనత సంపాదించిన గాథ కూర్చబడింది. దీనిలో ఇయ్యబడిన కథాంశం ఇది—

శ్రీ హీరుడు కాశీరాజు సభలోని విద్వాంసుడు. అతని భార్య మామల దేవి. కుమారుడు శ్రీహర్షుడు. కాశ్మీరదేశం పండితులకు పేరుపొందినది. అక్కడి రాజసభలో ప్రతి సంవత్సరమూ విద్వత్సభలు జరుగుతూఉంటవి. కాశీరాజు శ్రీ హీరుణ్ణి మిక్కిలి గౌరవించి కాశ్మీర పండితులతో శాస్త్రవాదన జరపడానికి ప్రోత్సహించి పంపాడు. రాజాజ్ఞ ననుసరించి శ్రీ హీరుడు మర్నాడు ఉదయమే కాలకృత్యాలు తీర్చుకుని తగిన దుస్తులు ధరించి కాశ్మీరానికిబయలు దేరాడు. అది గ్రీష్మర్తువు. నిప్పులు కురుస్తున్న ఎండలో 'కదలంజాలక చెట్లనీడ నిలిచెంగా సంతసేపు శ్రీ హీరుడున్' తర్వాత ప్రయాణంసాగించి భూతల స్వర్గమైన కాశ్మీరానికి 'ప్రొద్దు పడమట గ్రుంకక మున్నె చేరెను. అక్కడ ఒక సత్రంలో బసచేసి మర్నాడు రాజసభకు వెళ్లాడు. వాదనలో కాశ్మీర పండితుని గెలువలేక పరాభవంతో క్రుంగిపోయి కాశీకివచ్చి ఆ పరాభవంవల్లనే కృశించి మరణించాడు. తండ్రిని పరాభవించిన విద్వాంసునికి ప్రతీకారం చేస్తానని శ్రీ హర్షుడు తండ్రికి మాట యిచ్చాడు. పిదప మామల్లదేవి కొడుకుతో పుట్టింటికి వెళ్లినదికాని, అక్కడ తోటికోడలితో పడక తిరిగి కాశీకే వచ్చినది. శ్రీ హర్షుడు మాధుకరం చేసుకుంటూ, విద్యలు అభ్యసింపసాగినాడు. ఒకనాడు ఒక విద్వాంసుడు శ్రీ హర్షుడికి చింతామణి మంత్రాన్ని ఉపదేశించి, దాన్ని శవానిపై జపిస్తే గణపతి ప్రత్యక్షమై కోరిన వరాలు ఇస్తాడని చెప్పినాడు. శ్రీ హర్షుడు ఈ విషయాన్ని తల్లితో చెప్పాడు. కుమారుని శ్రేయస్సే ప్రధానంగాగల ఆ మాతృదేవి కుమారునికి తెలియకుండా శూలంతో ఆత్మహత్య చేసుకొనెను. శ్రీ హర్షుడామె గుండెలపై కూర్చుండి చింతామణిమంత్రాన్ని జపించగా గణపతి ప్రత్యక్షమై, శ్రీ హర్షుని కోరిక మేరకు మామల్లదేవిని బ్రతికించి, అతనికి సాటిలేని పాండిత్యాన్ని అనుగ్రహించాడు. తర్వాత రాజాజ్ఞ పొంది కాశ్మీరానికిపోయి, తన తండ్రిని పరాభవించిన విద్వాంసుని వాదంలో ఓడించి, విజయంతో కాశీకి వచ్చాడు. రాజువల్లనూ, ప్రజలవల్లనూ, గొప్ప గౌరవాలు పొందాడు. మేనమామ సలహాపై నైషధ కావ్యాన్ని వ్రాశాడు. అది మొదట్లో అయఃపిండ పాకాన పడడంవల్ల ఎవ్వరికీ అర్థం కాలేదు. పదిమార్లు దిద్ది దిద్ది వ్రాసిన తర్వాత ఆ కావ్యం విద్వదౌషధంగా తయారైనది. దానిని అతని పిదాళా శ్రీహర్షునకు ఉద్దిష్టమైన శ్రీనాథుడు తెలిగించాడు. ఆ మహాకవు లిద్దరూ 'దివ్యుల గుండె లవియగా, సాధర్మ్య విమాత్మ సింహాసనముల గూరుచున్నారు.'

గ్రంథానికి పేరు తగివున్నదేకాని కథా కథనంలో చమత్కృతి కానరాకున్నది. కొన్ని సన్నివేశాలు సరిగా లేవు. ఉదయం కాశీలో బయలు శ్రీ హీరుడు సాయంకాలానికి కాలినడకను కాశ్మీరంచేరినట్లుచెప్పడం వింతగా ఉన్నది. కాశ్మీరంలో శ్రీ హీరుని ఓటమి, శ్రీహర్షుని గెలుపు రసవంతంగా వర్ణిస్తేనే ఈ ఖండకావ్యానికి తగిన ప్రయోజనం ఉండేది. శ్రీ హర్షుని చరిత్రలో చివర శ్రీనాథుని చేర్చడం, అతని ప్రశంసా, సందర్భశుద్ధిని కోల్పోయాయి. అయఃపిండపాకం అనే పాకం లేనేలేదు.

రచయితలు "కవిచంద్రులు. మధుర కవులు అష్టావధానులు. ఆశుకవి సమ్రాట్టులు." ఇట్టి వారి కవిత్వంలో అనుచితములైన వర్ణనలు, ఛందోభంగాలూ, లక్షణ విరుద్ధ ప్రయోగాలూ కానరావడం ఆశ్చర్యంగానే ఉన్నది. కాశిలోని 'విశ్వనాథ దేవాలయమూ పరిశుద్ధ విమలాంబుల గన్పడ (పుట 3) అని వర్ణన. విశ్వనాథ దేవాలయం గంగ ఒడ్డున లేదు. కొంత దూరంలో ఒక ఇరుకు వీధిలో ఉన్నది. దాని ప్రతిబింబం గంగలో కన్పడడం అసంభవం! "రయిలుమీదవస్తూ, యాత్రికులు 'వినువీధిన్ గనిపించు సల్లదియె శ్రీ విశ్వేశుదేవాలయంబని చేతుల్ ముకుళింతు" రట! రైలులో పోయేవారికి విశ్వేశ్వరుని గుడి కానరాదు. దాని శిఖరం పరిసర భవనాలలో లీనమై ఉంటుంది. ఇది కాశికి వెళ్లిన వారికి బాగా తెలుస్తుంది. 'శ్రీహరుం డాత్మ, మతునిచేతులమీదుగా మృతినిగాంచె'(పుట 47) ఇచ్చట మృతిచెందినది శ్రీ హీరుడుకాని, శ్రీహర్షుడు కాడు. అచ్చుతప్పనుకొందామన్నా, తొలి ముద్రణంలో కూడా ఇట్లే ఉన్నది. శ్రీ హర్షుడే మరణిస్తే—ఆమీద కథయేలేదు.

ప్రశంసలో 'సర్వజ్ఞ కుమార సమ్రాట్టు యశోధూర్వహుడై' (పు. 10) ఛందోభంగము. 'వెలుగోటి వర్ణనన్' (పు 12) వెలుగోటి వంశవర్ణనన్ అనుటకు బదులుగా. గ్రంథంలో—'పిందోయికిన్' (పు 4) కందోయివలె పిందోయి ఉండవచ్చునని అభిప్రాయమేమో! 'విద్వాంస దీవసభల్' (పు. 11) విద్వచ్ఛబ్దమున్నదికాని అకారాంతమైన విద్వాంస శబ్దం సంస్కృతంలో లేదు. 'లీల దివాబిభ్రద్ధవి వెల బొలునట్లు' (పు. 18) ఛందోభంగము. 'పరిమి హర్షించిరి మేటి విద్వాంసవరుల్' (పు 22) ఛందోభంగమూ లక్షణ విరుద్ధ ప్రయోగమున్నూ. 'శ్రీ హీరుండొందిన యీ యవమానము జశన్ హృద్వీధి 'జింతింపగా' (పు 34) ఛందోభంగము. విద్యా నేపమ్ము' (పు 43) దుష్ట సమాసము. 'ఇమునైకమత్యాన' (పు 43) ఇముడు నైకమత్యాన— అనుటకు. ఇటువంటి సంధి సరికాదు. 'కన్నుగవ విప్పి మల్లాంబ' (పు. 52) మా మల్లాంబకాని మల్లాంబకాదు. 'మా మల్లాంబ' అని వ్రాస్తే ఛందస్సు కుదరదు. "తమో ప్రభాకర' (పు. 52) తమః ప్రభాకరా! అని ఉండవలెను. 'హార పులకిత తాపముత్యంబులతో

(పు. 52) దుష్ట సమాసము. 'సాహిత్య విహారి' (పు. 55) దుష్ట సమాసము. 'అతడుత్కర్షుడగుచు' (పు. 56) 'అతడుత్కృష్టుడగుచు' అని యుండవలసియున్నది. 'కాశీపతి సభా గౌరవాధ్య క్షతండు' (పు 69) పతి శబ్దం ఇకారాంతం. ఈకారాంతం కాదు. ఇకారాంతంగా మార్చుస్తే ఛందో భంగం కలుగుతుంది.

దీని తొలి ముద్రణ 1949 లో జరిగినది. అప్పుడిది కేసరీ కుటీరాధిపతులు, మహాదాత డాక్టర్ కే. ఎన్. కేసరిగారికి అంకితం ఇయ్య బడినది. ప్రథమ ముద్రణంలోని 'విజ్ఞాపన' లో 'ఆశ్రయించినదే తడవుగ కృతినందుకొని, ముద్రింపించి యిచ్చి' వారు సమ్మానించినట్లు కవిచంద్రులే తెలిపియున్నారు. ఆ ముద్రణలో కృతిపతి వంశాది కము, అవతారిక, అర్పణ పద్య రూపంగా ఉన్నవి. ఈ ద్వితీయ ముద్రణలో అవి అన్నీ తొలగించబడినవి. ద్వితీయ ముద్రణలో కావ్యపోషకులైన శ్రీ వెల గోటి వంశ మహాదయులు: శ్రీ రాజా కృష్ణయా చేంద్రరంగమన్నారుగారి ప్రశంసా పద్యాలున్నవి. గ్రంథం చివర కవి చంద్రులు ఒక సీసపద్యాన్ని కావ్య పోషకులను గురించి వ్రాసినా:

'తనరు కవిచంద్ర కోట సోదర కవీశ
రచితవరా హర్షుని రమ్య చరిత
కుసుమహారమ్ము గైసేసికొనుడు ప్రీతి
సాంద్ర గుణసూర్ఫర్తి! కృష్ణయాచేంద్ర
భూవ!'

అని తెలియజేశారు. దీన్నిబట్టి యిది యీ ప్రభువు నకు అంకితమేమో అనే భ్రాంతి కలగడానికి అవ కాశం ఉన్నది. ఈ పద్యమైనా దోష దూషితం కాకుండా ఉండవలసినది. ఇందులో రెండవపాదం లోనూ: నాల్గవ పాదంలోనూ ఛందోభంగం ఉన్నది. ఎన్నో చక్కని బిరుదులు సంపాదించిన రచయితలు కృష్ణంగా కానవచ్చే దోషాలనైనా సవరించుకో వలసినది.

ఇక అచ్చు తప్పుల సంగతి చెప్పనక్కరయేలేదు. ఉన్నీ: సగరుపిత్రాదులు (పుత్రాదులుకు బదులు) పువుదేవియులు, వేడిహితము: చెలించెను: యాత్ర కావలి: వారణాశి మొదలైనవి చదువరులను తప్పుమారాలకు మళ్ళించడానికి అనువుగా కనబడు తున్నవి. థ, ధ లు తారు మారుగా ఉండడం అమూలా గ్రం కానవస్తుంది. రచయితలు కొంత శ్రద్ధ వహిస్తే 70 పుటల చిన్న పుస్తకంలో ఇలాటి తప్పులు దొరలకుండా ఉండేవి. ముందు ముద్రణాలలో అయినా లోపాలు లేకుండా ఉండేటట్లు కవిచం ద్రులు గమనించవలసి ఉన్నది.

—ఆంగీరస.

## బ్రిటిష్ విద్యార్థి

బ్రిటిష్ ఇన్ఫర్మేషన్ సర్వీసెస్ తరఫున కేంద్ర సమాచార కార్యాలయం తయారు చేసిన తెలుగు విద్యార్థి మా కార్యాలయం చేరింది. ఇందులో బ్రిట న్లో విద్యాభ్యాసముపేక్షప చేసే విద్యార్థులు, తద్వారా తమతమ దేశాలకు వారు దోహదపడే అవకాశం, బ్రిటన్లోని విద్యాసంస్థలు, విద్యార్థులు పనిచేసే తీరు, తీరికవేళల్లో వారు నిర్వర్తించే కార్యకలాపాలు మొదలైన విషయాలన్నీ విపులంగా చర్చించబడ్డాయి. ఈ విషయానికి సంబంధించిన ఆకర్షణీయమైన ఫోటోలు, అందమైన ముద్రణ పుస్తకానికి మరింత వన్నె తెచ్చాయి. ప్రతివిద్యార్థి చదవదగిన పుస్తకం 'బ్రిటిష్ విద్యార్థి.'

## మోహినీ భస్మాసుర

ఆంధ్ర రత్న బుక్ డిపో, తెనాలి వారు ప్రచు రించిన 'మోహినీ భస్మాసుర' పౌరాణిక నాటకం మా కార్యాలయం చేరినది. రచయితలు శ్రీయుతులు నాగశ్రీ, దరిశి వీరరాఘవస్వామి. వెల : రూపాయి డెబ్బయి అయిదు పైసలు. కాపీలకు ప్రచురణ కర్తలకు వ్రాయాలి.

Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambu chetty Street Madras-1. Phones : Editorial. 21747; Other depts ; 29766. Chief Editor: S. Sambhu Prasad.

